# ఆర్యసూక్తిముక్తావళి

ప్రథమ భాగము

(భారతము)

ఇది

సత్యవోలు అప్పారావుచే

మానవసేవాపత్రికయందు

ప్రకటింపఁబడియె

రాజమహేంద్రవరము.

శ్రీ వ్యాసనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1913

వెల 4 అణాలు.

# ఆర్యసూక్తిముక్తావళి

ప్రథమ భాగము

(భారతము)

ఇది

సత్యవోలు అప్పారావుచే

మానవసేవాసమితియందు

ప్రకటింపఁబడియె

---

రాజమహేంద్రవరము.

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

వెల 4 అణాలు.

# విజ్ఞాపన

సంస్కృతభాషయందును నాంగ్లేయభాషయందును బూర్వమహాకవిరచితములైనకావ్యములనుండి నీతిని ధర్మమును బ్రబోధించుపద్యముల నెత్తి ప్రత్యేకగ్రంథముగఁ బ్రకటించి లోకమునఁ బ్రకాశింపఁ జేయుటాచారము కలదు. మన యాంధ్రభాష కట్టి భాగ్యము లభించినది కాదు. ఈకొఱఁత నివారింపఁ బూని కొందఱిదివఱకు భారతమునుండి మాత్రమే కొన్నిపద్యముల నెత్తి ప్రకటించిరి. ఆంగ్లభాషలో ధర్మము లను తరఁగలు తాండవమాడు మహాప్రవాహములై కవిత్వముఁ జెప్పి విద్యాసరోరుహప్రాయకమలముల వికసింపఁజేసి కీర్తిఁ గాంచినకవిభాస్కరు లెందఱో కలరు. అట్టివారిగ్రంథములనుండి నీతివాక్యముల నెత్తి వేఱుగ్రంథముగఁ బ్రకటింప వలయు ననుతలంపు గలుగుటచే నే నిక్కార్యమునకు దొరకొని "ఆర్యసూక్తిముక్తావళి" యనునామ మిడి మును ముందు కావ్యరాజ మని ప్రసిద్ధిఁ గాంచిన భారతములోని నీతిపద్యములఁ బ్రకటించితిని. మఱియుఁ దెనుఁగునఁ గలపురాణములనుండియు మహాకావ్యములనుండియు నీతిపద్యము లీగ్రంథమునందుఁ బ్రకటింపఁబడును. భారతములోనిపద్యములు పూర్తి జేసి యీగ్రంథమును బ్రథమసంపుటముగఁ బ్రచురించితిని. ఇఁకముందు రాబోవు మామానససేవాసంపుటములలో భాగవతము రామాయణము మున్నగు నాంధ్రగ్రంథములనుండి నీతివాక్యములు ప్రకటింపఁబడును. కావున నెల్లరు నిట్టిగ్రంథములఁ జదువవలయు నవియుఁ దెనుఁగుగ్రంథములలోఁ గల నీతుల వెలయింపఁ జేయు నిట్టిగ్రంథములే దేశాభివృద్ధికరము లని తెలిసికొని యాదరింప వలయు ననియు, లోకజ్ఞానము గలిగి దయాసత్యశౌచములతోఁ గులతూఁగుచు దేశమును వెలయింపఁ జేయుట మానవస్వభావము కావున నట్టి స్వభావనిరూపణము సేయుచు నిట్టిసాధనము లవియు లని తెలిసికొని యెల్లరు నాదరింపవలయు ననియుఁ గోరుచున్నాఁడను.

ఇట్లు

సజ్జనవిధేయుఁడు
సత్యవోలు అప్పారావు.

రాజమహేంద్రవరము.
29—3—1913

# ఆర్యసూక్తిముక్తావళి.



తే. తగినవేషంబు, తెనుదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ
కునికి, దన కెంత నడవకయున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పుసేయు. 1

క. అడిగిన నలుగక యెగ్గులు
వలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్
పలుకక జన్నముపడి యెదఁ
దలఁపకయున్నతఁడు నూవె ధర్మజ్ఞుఁ డిలన్ 2

తే. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు,
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము, శత్రునకునైన
నిచ్చుటయ లెన్న యడిగినయెడ నృపాల! 3

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁజేసి తపిఁగి శరీరుల్
క్రూరతరబాధ బొందుదు
రారెంటినిఁ గెలుతు రార్యు లమలినబుద్ధిన్ 4

తే. చెల్లియుండియు సైరణ సేయునతఁడు,
జేవవడియును నర్థికి బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య! 5

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు, లోకనింద్యముల కుడుగుచు, మీ
రినయొఱుని కలిమి కులుకక
మనుజులలోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా! 6

ఆ. విను మహింస ధర్మవితతి కెల్లను మేటి
యదియు సత్యయుక్తమైన నెలయు

నాథ ! శిష్టచరితలందు సత్యము కడు
నధిక మనిరి శ్రుతుల నరసి బుధులు. 7

క. పురుషుండు రెండుతెఱఁగుల
ధర నాత్ముఁ దనఁగఁ బరఁగు దా నెయ్యెడలం
బరుసములు పలుకకునికిన్
దురితంబులు వొరయ పనులు దొరఁగుటవలనన్. 8

ఉ. ధర్మము పల్కుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థమున్
జేరి యుఁ గాంచి ధర్మనిధిఁ జెంద్రియులై ప్రజలన్ సృజించి స
త్కర్మములు ప్రశస్తములుగాఁ గ్రతువుల్ నొనరించు సజ్జనుల్
ధర్మజ ! యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్టసంపదల్. 9

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ; వెండియుఁ గడుమే
లొనరించు ; గీడొకించుక
యును దనదెసఁ దోఁపనీక యుడుగుచువచ్చున్ 10

సీ. దానంబు సత్యంబుఁ దపము యజ్ఞము వార్జవముఁ గామలోభాదివర్జనంబు
గురుజనశుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష మధ్యాయననిరతి
దాంభికత్వము లేమి దైన్యంబు వొరయమి యనసూయ యనహంక్రియాభియుక్తి
దలపంగ వాద్యమై తనరు ధర్మము నెప్పు గొనియుంట వాస్తికగోష్ఠి జనమి

గీ. శీలసంరక్ష తీర్థసంసేవ శౌచ
మఖిలభూతములందు దయార్ద్రిఁ దగుట
మితహితోక్తులు సంశ్రితమిత్రగుప్తి
యున్నియును శిష్టచరితంబు లిద్ధచరిత ! 11

శా. ఆలస్యం బొకయింత లేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా
జాలం బేమర, మర్త్యవీయు లతిథుల్, సత్యంబ పల్కుంబడున్,
మైత్రి శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిందాల్తు మద్గోట నె
క్కాలంబుం బటుమృత్యురోగభయశంకం బొందరే మిమ్ములన్ 12

చ. ఎకపక వాఙ్మనఃక్రియల నెక్కి హింస యొనర్పఁబూన, రె
1 య్యెడలను డంబం గిరణ మేర్పడఁ బోరవ చూతు, రిచ్చచో
గపమపడంగనీ కెదిరి కాంక్షితముల్ తుదముట్టఁ దీర్తుఁ, రె
వ్వఁడు మదిఁ గూర్తు రాశ్రితులనన్ విను మిన్నియు నార్యధర్మముల్. 13

భారతము.

# ఆర్యసూక్తిముక్తావళి.



తే. తగినవేషంబు, తనుదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ
కునికి, దన కెంతె నడవకయున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పు సేయు. 1

క. అలిగిన నలుగక యొగ్గులు
పలికిన మతి వినినయట్ల ప్రతివచనంబుల్
పలుకక జన్మమువడి యెదఁ
దలఁపకయున్నతఁడు సూవె ధర్మజ్ఞుఁ డిలన్ 2

తే. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు,
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట యోగము, శత్రునకునైన
నిచ్చుటయ లెన్న యడిగినయెడ నృపాల! 3

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁ జేసి తత్తఱి శరీరుల్
క్రూరతరబాధ బొందుదు
రా రెంటినిఁ గెలుతు రార్యు లమలినబుద్ధిన్ 4

తే. చెల్లియుండియు క్షమగణ సేయునతఁడు,
పేదవడియును శక్తికి బ్రియములొసఁగ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు కురువరేణ్య! 5

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు, లోకనింద్యముల కుడుగుచు, మీ
రినయొయని కలిమి కులుకక
మనుజులలోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా! 6

ఆ. విను మహింస ధర్మపరత కల్లను మేటి
యనియు సత్యయుక్తమైన పలుకు

అనఘ ! శిష్టచరితలందు సత్యమె కడు
నధిక మనిరి శ్రుతుల నెఱిగి బుధులు. 7

కం. పురుషుండు కొంతతెలుఁగుల
ధర నెత్తుముఁ దనఁగఁ బరఁగు దా నెయ్యెడలన్
పరుసములు పలుకకునికన్
దురితంబులు వైరయును బనులు దొలఁగుటవలనన్. 8

ఉ. ధర్మము పల్కుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థమున్
జేరి యుఁ గాంచి ధర్మవిధిఁ గాంక్షయునై ప్రజలన్ సృజించి స
త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ వొనరించు సజ్జనుల్
ధర్మజ ! యింపు సొంపునఁ ముదంబునఁ గాంతు రభీష్టసంపదల్. 9

కం. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ; వెండియుఁ గడుమే
లొనరించు ; గీడొనరించుక
యును దనదెసఁ దోపనీక యుడుగుచునచ్చున్ 10

సీ. దానంబు సత్యంబుఁ దపము యజ్ఞము నార్జవముఁ గామలోభాదివర్జనంబు
గురుజనశుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష మధ్యయనరీతి
దాంబికత్వము లేమి దైన్యంబు వైరయుమి యనసూయ యనహంక్రియాభియుక్తి
దలపంగ వాద్యమై తనరు ధర్మము నెప్పు గొనియుంట నాస్తికగోష్ఠి జనమి

గీ. శీలసంరక్ష తీర్థసంసేవ శౌచ
మఖిలభూతములందు దయార్ద్రిఁ దగుట
మితహితోక్తులు సంశ్రితమిత్రగుప్తి
యున్నియును శిష్టచరితంబు లిద్ధచరిత ! 11

శా. ఆలస్యంబొకయింత లేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా
జాలం బేమర, మర్చనీయు లతిథుల్, సత్యంబు పల్కంబడున్,
మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు ముల్లోట నె
క్కాలంబుం బటుమృత్యురోగభయశంకం బొందమే మిమ్ములన్ 12

చ. ఎడపక వాఙ్మనఃక్రియల నెవ్విటి హింస యొనర్పఁబూన, రె
య్యెడలను డెల్లం గరుణ ధైర్యపడఁ బోవన చూతు, రిచ్చుచో
గడమపడంగనీ కడిది కాంక్షితముల్ తుదముట్టఁ దీర్తుఁ, రె
ప్పుడు మదిఁ నుద్ధ రాశ్రితులనెన్ వినుమిన్నియు నార్యధర్మముల్. 13

భారతము.

క॥ పరులధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మానం
బెరియఁగ నసహ్యపడు న, న్నరుఁడు తెవులులేని వేదనంబడు నధిపా 24

క॥ ఎదిరికి హితమును బ్రియమును, పదికింపును గాఁగఁ బలుకుమాటలు వైక్ర
యొదవినను లెస్స; యటుగా, కిది యది యన కూరకునికి యంతయు నొప్పున్ 26

క॥ చెలిమియుఁ బగయును దెలివియుఁ, గలఁకయు ధర్మంబుఁ గోపగతియును బెంపుం
దులుకతనంబును వచ్చును, బలుకుబడిన, కానఁ బోసఁగఁ బలుకగవలయున్ 29

క॥ తనువున విరిగిన యలుగుల, ననువునఁ బుచ్చంగవచ్చు; నతినిష్ఠురతన్
మనమున నాటిన మాటలు, విను మెన్నియుపాయములను వెడలునె యధిపా 27

తే॥ నియతతపమును నింద్రియనిగ్రహంబు, భూరికీర్తియు శాంతికిఁ గారణములు
వానియన్నిటికంటె మేలైన శాంతి, కారణము లోభము సెగుట కాగ నేంద్ర 28

క। కారణములేకయును నప, కారపరత్వమున నోయుదు కార్యంబులకున్
వారనియలజడి బడియెదు, వారలు మా యేమగడయా వసుధను నధిపా 29

సీ॥ సత్యహితాలాపచతురత యార్జంబు; సంతత సుజనపూజనము వలయు;
విను క్రోధసంరంభ విద్వేషములఁ జేసి పతికలంగినను ధర్మంబుఁ దప్ప
కుండంగ నడచు టత్యుత్తమసరణి; యప్రియములయందును బ్రియములందు
దైన్య హర్షంబులఁ దగులక యున్నట్టి కళ్యాణవర్తనకాంతు లెస్స;
యొగ్గుచేసినవారికి హితము సేత, యార్యజనములు కీర్తింతు; రన్యదోష
కారి తనదోషమునఁ దాన కాలిపోవు, వేఱ వానికిగీడు గావింప నేల? 30

క॥ అది సర్వదోషముల కా, స్పద మది దురితక్రియానుబంధంబులకున్
మొదలు నిరంతరదుఃఖ, ప్రదమని వదిలించి తృష్ణ బాయుదు సుమతుల్ 31

క॥ మదిమఱపున బాపము తన, కొదవుటయును విదప నగిచి యొకసత్యమును నే
నిది సేయ నింక ననిమడు ఒది జాలసగమును నదుండు పలఁపు నఘంబుల్ 32

ఆ॥ విడుపు వలయు సకలవిషయవాంఛలయందు, విడుపు బోలుగాను వెదకి చూడ
గానక్షితి బుధులు; కలదె పరిత్యాగ, శీలునకు నసాధ్యసిద్ధి యెందు? 33

తే. వార్తయందు జగము వర్తిల్లుచున్నది, అదియు లేనినాడ యఖిలజగము
నంధకారమగ్నమగు నట్లు గావున, వార్త నిర్వహింపవలయుఁ బతికి 45

తే. కార్యగతుల తెఱఁగుఁ గలరూపు జెప్పిన, నధికమతులు దాని నాదరింతు
రల్పభాగ్యబుద్ధు లగువారలకు నది, విరసకారణంబు విషము వోలె 46

క. ధర్మజ్ఞులైన పురుషులు ధర్మమునకు బాధసేయు ధర్మువు నెందుక్
ధర్మముగా మది దలపరు, ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్ 47

క. తగు నిది తగ దని మదిలో, వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల, కగు నిమిత్తాగమంబు లయిన భయంబుల్ 48

క. నరనాథుఁ గొలిచి యలవడ, దిరుగిలి నాకేమి యనుచుఁ దేఁకువ లేమిన్
మరియాదఁ దప్ప మెలఁగిన, బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే! 49

క. పలుమరు శపథంబులు, నం, జలులును, నభివాదనములు, సానప్రియభా
షలు మిథ్యావచనంబులు, గలయవి దుష్టస్వభావ కాపురుషులకున్ 50

ఆ. కారణంబు లేక దారుణంబుగ సాధు, హింస సేయు కుజనుఁ డెల్ల వారి
కప్రియుండ కాక యప్రియులకునుం, బొందు కలదె తలఁప నుత్తములకు 51

క. నెమ్మి గలవారి నెల్లరు, నెమ్మెల్ల నివారి వెనుకఁ దగులుదు రధిక
త్వమ్మెఱిఁగి యెఱిఁగి తోడుదు, రిమ్మెయిఁ గని యట్టివారి లిఖపుర నాథా 52

క. రోషము శోకము, రాగ, ద్వేషము లభిమాన దర్ప వేగాలస్యా
శ్లేషము లజ్ఞాన మనిమ, నీషిజనము సెప్పు మాననీయచరిత్రా! 53

ఆ. సకలపుణ్యకర్మచయమును నొకదెస, వినుము పాడివప్పునికి నొక్క
వలను దీని శ్రుతులు దెలిపెడునెడఁ బాడి, కలిమియందు నెక్కుడు గాని పించె 54

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడపుం ద్రివర్గమున్
గురుతరమోక్షధర్మమునకుం దలపం దనప్రాప యూఁత; భూ
వర! విను పోటకంబునకు వాగెయు, దంతికి నంకుశంబు నే
కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్ 55

భారతము

తే. మిత్రిసంపన్నుఁడైన సమిత్రిమిత్రి । బలముతోడను భేదించు బలముఁ జలముఁ
గలిగి దేశబలంబును గాలబలము । గలుగువాని కసాధ్యంబు గలదె యెందు 56

క. సత్యంబు బ్రహ్మచర్యము । నిత్యశుచిత మౌన మతులనియమము దయ శు
ద్ధత్యాగంబుఁ దపస్సం । పత్యాకృతు లండ్రు బుధులు పౌరషముఖ్యా 57

క. మృదుభాషణముల దుర్జన । హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె? యె
ల్లిదముగఁ గొని యంతంతకు । మద మెక్కుం గాక దురభిమానము పేర్మిన్ 58

తే. గర్వియై కార్య మిట్టి దకార్య మిట్టి । దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ కున్మదవృత్తి వర్తించునట్టి । వాని గురునైన దండింపవలయు నండ్రు 59

చ. నుతజలపూరితంబు లగునూతులు నూటికంటె నూన్నత
వ్రత యొకబావి మేలు, మఱి బావులు నూటికంటె నొక్కస
త్క్రతు వది మేలు, తత్క్రతుశతంబులకంటె సుతుండు మేలు, త
త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు సూడఁగన్ 60

చ. ధనపతితో దరిద్రునకుఁ, దత్త్వవిదుం డగువానితోడ మూ
ర్ఖునకుఁ, బ్రశాంతుతోడఁ గడుఁ గ్రూరునకున్, రణశూరుతోడ భీ
రునకు, వరూధితోడ నవరూధికి, సజ్జనుతోడఁ గష్టదు
ర్జనునకు, నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే? 61

చ. కరితురగాదిఘట్టనము గాలియు నొంపని యొంటియున్న య
త్తరువు ననేకభూరుహవితానము గుంపయి యున్న బాధలం
బొరయునె? యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు, లట్లు గా
కరవయి నిల్చినం గెలని కెల్లిదమై పఱివోదు రంతయున్ 62

తే. బలముఁ గలవానిఁ బలువురు బలవిహీను । లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి,
మధువుఁ గొన నుత్సహించిన మనుజు బట్టి । కుట్టి నిర్జించు మధుకరకులము నట్లు 63

క. అలఘుబలశక్తిమోదా । త్తులకైనను బలము లేక దోర్గర్వముమై
గెలువఁగ వశమె సహాయుల । కలిమి ననంతరంబు లగుపరసైన్యములన్. 64

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయప్రభంగులె మందు గాక, ని
ర్మాయత నల్లసిల్లెడుపరాక్రమశీలురు గల్గి రెట్టి? దై
తేయులు తొల్లి మాయల నతిప్రబలాత్మకు లైనఁ దద్వధో
పాయములం జయింపరె నృపాలక! విష్ణుఁడు నింద్రుఁడుం దగన్. 65

ఆ. వె. పగయ కలిగెనేనిఁ బాము న్నయింటిలో । నున్నయట్లు కాక యూఱడిల్లి
యుండు నెట్లు చిత్తమొకమాటుఁ గావున । వలనదధికకర్గ్ఘవైరస్ఫూర్తి. 66

క. బాలుఁ డనితలఁచి రిపుతో । నేలిదమునఁ గలసి యునికి యిది కార్యమె యు
త్కీలానలకణ మించుక । సాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్. 67

క. మనుజులకు నెవ్వనంబున । ననతిక్రమణీయ మైన యాపద్విషయం
బున సంతాపింపంగాఁ । జన దని యెఱిఁగియును దగునె సంతాపింపన్. 68

క. ధృతి యారోగ్యము నొసఁగును । ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు, ధృతి కీర్తిసము
న్నతిఁ జేయుఁ గాలగత్యా। గతి గలిగినఁ గలుగు ధృతి వికారవిదూరా. 69

క. కడునధికుతోడఁ దొడరినఁ । బొడిచిన నొడిచినను బురుషు పురుషగుణం బే
ర్పడుఁ గాక హీను నొడుచుట కడిఁదియె పౌరుషము దానఁ గలుగునె చెప్పుమా? 70

క. బలహీను లైనవారలు । బలవంతుల నొడుమనప్పుడు బహుళగమాగమా
బలములఁ జేయుట యొందును । గలయని, యాజయము కాదె కర్తవ్య మిలన్ 71

క. విను పురుషుఁడు గావింపని । పనులకు దైవ మది యెట్లు ఫల మొసఁగించున్
జనములు కార్యము సడుపఁగ । ననుకూలత నిచ్చుఁ గాక యయ్యైఫలముల్ 72

తే. పౌరుషమ్ము ధైర్యంబు తోడ్పాటు లేక । ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర!
విత్తు సహకారి గాకున్న రిక్త నేల । వంధ్య మగుగాక, తా ఫలవంత మగునె 73

తే. మేలు రెండులోకంబుల మేలు తెచ్చు । గీడు సేయఁ బవంపడి కీడ యగును
గాన పురుషవర్తనమునే కానుకూల్య । శీల మగుదైన మది ఫలసిద్ధిఁ జేయు. 74

క. చెలిమియు సంభాషణమును । బలిమి వివాదంబుఁ ద్రొక్కుఁబాడియు దమయం
తలవారితోన తగునవి । కులహీనులతోడ నెప్పుఁ గొఱగావు పథపా. 75

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠలాభము । ప్రజ్ఞయ నాకం బనంగఁ బ్రజ్ఞయ మవ్వే
ప్రజ్ఞయ కైవల్యదమును। బ్రజ్ఞాసాధ్యములు కాని పనులుం గలవే. 76

క. గురుకొని కార్యాకార్యము । లెఱుఁగక దుశ్చరితుఁడై యహితుఁ డగునేనిన్
మఱవక గురు నైనను జను । లెఱుఁగఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్ 77

క. ధీరమతియుతులతోడ వి । చారము సేయునది మును విచారితపూర్వ
ప్రారంభ మైనకార్యము। పారము వొందును విఘాతపదదూరం బై. 78

ఉ. ఇమ్ముగ నాత్మరక్ష విధియించువిధంబున మంత్రరక్ష య
త్నమ్మునఁ జేయఁగావలయుఁ దప్పరిరక్షణశక్తి నెల్లకా
ర్యమ్ములు సిద్ధిఁబొందుఁ బరమార్గము, మంత్రవిభేద మైనఁ గా
ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతి కైనను నేరఁ బోలునే 79

క. తన కపకారము సేసిన। జనుఁ డల్పుం డనుచు నమ్మి జడమతియై చే
కొనఁ జన దించుకము ల్లయి । నను బాదతలమున నున్న నడఁచఁగ నగునే. 80

చ. తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా
నొడివియు సఖ్య మిచ్చియు జనున్ జననాథకృతాపరాధులం
గడఁగి వధింపఁగా ననుట కార్యముగం బిది గాన నెట్టులుం
గడుకొని శత్రులం దెలుపఁగాంచుట కార్యము రాజనీతి మై. 81

క. మొనసి యపకారిఁ గననిచిఁ । కొనియుండెడుసుమతి దీర్ఘకుజశాఖాగ్రం
బుననుండి నిద్రవోయెడు। ఘనునకు సమానుఁ డగుఁ బ్రమత్తత్వమునన్ 82

క. తన కిమ్మగునంతకు దు । ష్టునిఁ డిష్టుఁడపోలె నుంచి సర్పముఁబోలెన్
దన కిమ్మగుడును గఱచును । ఘనదాయగర్మ్యగళశిఘనసంస్ప్రిలచేక 83

ఆ. కీర్తి లేనివానికిని జీవనంబు ని । రర్థకంబు నూనె యవనిమీఁద
నిత్య మయినధనము నిర్మలకీర్తియ । యట్టికీర్తి నడయు టశ్రమంబె. 84

క. ఇలఁ గీర్తి యెంతకాలము । గలిగి ప్రకీర్తిల్లు నంతకాలంబును ని
త్యులు గారె గీర్తిగల పు । ణ్యులు, కీర్తిహీనుఁ డెంగనుం బూజ్యుండే. 85

క. ధీరమతియుక్తిఁ జేసి వి। చారింపఁగ నిక్కమంబు సర్వజనస్వ
ర్గారోహణసోపానం। బారఁగ ధర్మంబ చూవె యతిరమ్య మగుచున్. 86

ఉ. శత్రుల నాజి నోర్చుటయు, సర్వభయంబులఁ బొందకుండఁగా
ధాత్రిఁ బరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం, బ్రియంబుతోఁ
బాత్రుల కర్థ మీగియును, బ్రాహ్మణపూజయుఁ జూవె యుత్తమ
క్షత్రియధర్మముల్ సుగతికారణముల్ విపులార్థమూలముల్. 87

చ. అరదము దేహ, మింద్రియము లశ్వము, లాత్మఁడు సూతుఁ, డిమ్మహా
తురగచయంబు ధైర్య మను తోరపుబగ్గములన్ దృఢంబుగా
నురుపడిఁ బోకయుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు స్వర్గపుం
దెరువున నేఁగు, నప్పరమ ధీరుఁడు సుమ్వె యుదారుఁ డెయ్యెడన్. 88

తే. ఇంద్రియంబులు దిఱిచినయెడకు బాఱు। చుండు మన మెప్డుఁ దద్వేగ ముడుపకున్న
వెడలి చెడిపోవు బుద్ధి యుద్ధ్ణపవన।హతిఁ బయోనిధిలోఁ గల మఱియు నట్లు 89

మ. అసుఖాకారత నిద్ర దైన్యము విమోహం బక్షమత్వంబు దా
మసభావంబులు, రాగలోభజడతామానంబు లూహింప రా
జసవృత్తంబులు, ధైర్యశాంతికరుణాసంతోషవిద్యాదు లిం
పెసఁగన్ సాత్త్వికచేష్టితంబులు,నిజం బిట్లాత్మ గన్మిన్నియున్ 90

చ. అనఘుఁడు సాత్త్వికుం డగుమహాత్ముఁడు బోధనిరూఢిఁ దత్వముం
గనుఁగొని లోకవృత్తములు గా వని రోసి సమస్తసంగభం
గనిరతుఁడై తొలంగు మమకారవికారమహంక్రియామ్యతిం
బమపడి సంయమప్రకటభావన నుత్తమశాంతిఁ గైకొనున్ 91

క. కామంబును గ్రోధంబును। నేమఱక జయింపవలయు నెల్లవిధముల్లన్
ధీమహితా! యిది యాసతత। క్షేమంకర మైనపథము కృతబుద్ధులకున్. 92

క చేతనరహిత క్షేత్రముఁ। జేతనముం బొందఁ జేయుజీవాత్మ దగా
స్వీతుఁడు పరమాత్ముఁడు వి। ఖ్యాతుఁడు త్రైలోకసంప్రకల్పనుఁ డనఘా. 93

—భారతము—

మ. విలసద్ధర్మవిశుద్ధవృత్తులు తపోవృద్ధుల్ గుణాగ్రీయబు
ద్ధులు మధ్యస్థులు గార్యనిర్ణయసమర్థుల్ మానమాత్సర్యదూ
రులు నాఁ జాలినవారిపల్కులకు వైరుధ్యంబు గావింపరు
జ్ఞులు భూనాథుల కాప్తులున్ సఖులునై శోభింతు రత్యంతమున్ 94

క. అరయఁగ విషయము లెంతయు, దురంతములు వానియందుఁ బొడరినఁ జేటుం
బొరయుదురు పొడచకున్నం, బరమపదవి యమ్మహానుభావులకు నగున్. 95

తే. వాఙ్మనఃకాయములు శౌచవంతములుగ, జేసికొని యనహంకారశీలశాంత
బుద్ధి యై నిరపేక్షతఁ బొంది యఖిల, భూతదయ గల్గి మెలఁగంగ బోధ మొందు 96

క. క్షమయును సత్యంబును శౌ, చమును సుధర్మములు బ్రహ్మచర్యం బత్యు
త్తమధర్మము వానికిఁ జి, త్తము నలవఱుపంగవలయు ధైర్యము పేర్మిన్. 97

తే. అర్థవంతుఁ డై భోగంబు ననుభవించు, చున్న యప్పుడ యిది యిట్టు లుండ నేర
దస్థిరము తాను లోనుగా ననియెఱుంగు, నతఁడు పగఁ బొందఁ డేచియు నైన నధిప. 98

క. ప్రాజ్ఞుఁడు రమించు నొక్కెడ, ప్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతిఁ బరఁగఁగఁజేయున్
బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ, బ్రాజ్ఞుఁడు కలహమునఁ దొట్టుపడక తొలంగున్. 99

క. దోష మరసి కామంబును, రోషంబును లేక తగినరూపునఁ జేయం,
బోషక మగు ధర్మమునకు, వైషమ్యవిహీన మైనపథము కుమారా. 100

క. విమలజ్ఞానముఁ దపమును, దమమును ద్యాగంబు శాశ్వతప్రమదానం
దములకు మూలము లండ్రు ని, జముగాఁ గైకొం డ్రివియ ప్రసన్నవివేకుల్. 101

క. జ్ఞానంబు నాశ్రయించిన, వానికి నేపదలఁ గీడు వాటిల్లదు ప్ర
జ్ఞానరహితుండు కామా, ధీనత మెయిఁ గర్మసమితిఁ ద్రిప్పులఁ జిక్కున్. 102

క. విను మచిరవృత్తిఁ జేసిన, పని కర్తకు నావహించుఁ బశ్చాత్తాపం
బనఘా! చిరభావితము, ద్ధనిరూపణకృతము శుభముఁ దేజముఁ దెచ్చున్. 103

క. కార్యవిచారము చిరముగ, ధైర్యముతో నడపవలయుఁ దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁ డని, యార్యులు సేయుదురు నిశ్చయంబు దిరముగన్ 104

క. మిత్రత్వము శత్రుత్వము, పాత్రతయు నపాత్రతయును బరికించు నుచా
రిత్రుఁడు చిరతరగణనా, సూత్రితముగ దాన నెల్లశుభములు నొందున్. 105

చ. వినయము విద్యయుం గలుగువిప్రునియందును గోవునందు నో
ష్పు నెఱయుహస్తియందు నొకపోకకుఁ బోషనికుక్కయందు దా
ని నడిచి తెచ్చి వండి తినునీచపుమాలనియందుఁ దుల్యద
ర్శనులు ప్రశాంతరాత్ముని నిరంజనునిం గనునట్టిపండితుల్. 106

క. రాజునకు విజయమూలము, రాజితమంత్రంబు సుస్థిరంబుగ దానిన్
రాజాన్వయ! రక్షింతె ధ, రాజనులకుఁ గర్ణగోచరము గాకుండన్ 107

క. నానావిధరణవిజయము, హానిపుణు లవార్యవీర్యు లవఁ దగువారిన్
సేనాధ్యక్షులఁ జేసితె, నీవవిమ్రనవారి మాననీయుల క్షితులన్. 108

క. చోరభయవర్జితముగా, ధారుణిఁ బాలింతె యధికధనలోభమునం
జోరుల రక్షింపరుగా, వారలచే ధనముఁ గొని భవద్భృత్యేశ్వరుల్. 109

క. ధరణీనాథ! భవద్భుజ, పరిపాలిత జానపదముఁ బరిపూర్ణము లై
కర మొప్పుచున్నె చెఱువులు, ధరణి కవగ్రహభయంబు దనుకక యుండన్ 110

క. పంగుల మూకాంధుల విక, లాంగుల వృద్ధుల బాంధవుల దయం బ్రోతె భయా
ర్తుం గడఁదిశత్రు నైనను, సంగరభంగమునఁ గాతె శరణం బనినన్. 111

క. కృతి మెఱిఁగి కర్త నుత్తమ, మతుల సభల సంస్తుతించి మఱవక తగ స
త్కృతి సేయుదె కృత మెఱిఁగెదు, పతివై జగజ్జనులనెల్లఁ బరిపాలింపన్. 112

క. పరకీయము బాహ్యార్థ్యం, తరజనములవలన సంతతము నిజగత్యా
పరుఁడ వయి పరమభోగుల, చరిత్రము వీక్షింతె నిపుణచరనేత్రములన్. 113

క. తెలియఁగ విద్వజ్జనము, ఖ్యాలతోడ నశేషధర్మకుశలుఁడ వయి యు
ష్మల లోకవ్యవహార, ముల దయఁ బరికింతె నిత్యమును సమబుద్ధిన్. 114

చ బహుగజధాన్యసంగ్రహము బాణశరాసనయోధవీరసం
గ్రహము నిరంతరాంతరుదకంబులు ఘాసరసేంధనౌఘసం
గ్రహము ననేకయంత్రములుఁ గల్గి యసాధ్యము లై ద్విషద్భయా
వహము లనంగ నొప్పునె భవత్పరరక్ష్యము లైనదుర్గముల్. 115

ఉ. వదలక బుద్ధి నంతరరివర్గము నోర్చి జితేంద్రియుండ వై
మొదలను దేశకాలబలముల్ మఱి దైవంబలంబుఁ గల్గి భూ
నదితబలుండ వై యహితవీరుల నోర్వఁగ నుత్సహింతె దు
ర్మదమలినాంధచిత్తులఁ బ్రమత్తుల నింద్రియనిర్జితాత్ములన్. 116

తే. క్షత్రనీతికిఁ గ్రమములుగావు సూనె, నిష్కృతియును జూదమును ధర్మనిత్యు లైన
వారి కీరెండు వర్జింపవలయు నెందు, బాపవృత్తంబు జూదంబు పార్థివులకు. 117

ఆ. కుటిలమార్గు లయినకుత్సితకితవుల, తోడఁ గడఁగి జూద మాడఁ జనదు
దానఁజేసి యర్థధర్మవినష్టికి, లగుదు రెట్టివారు జగములోన. 118

తే. తగిలి నిత్యంబు నేకాంతధర్మశీలుఁ, డగుట యుత్తమం పురుషున కట్టివాని
వెలయ నర్థకామంబులు విడుతుఁ జాలఁ, విగతసుఖదుఃఖములు రెండు విడుమనట్లు 119

క. అరివరుల నోర్చి సాగర, పరిస్కృతభూచక్రి మెల్లఁ బాలింపు ప్రజా
పరిపాలనంబుకంటెను, ధరణీశ! విశేష మొండు ధర్మము గలదే. 120

ఉ. అలఘుగుణంబులం దధికుఁ డైనమహాత్ముఁడు రాగకోపమ్మూ
ఢులఁ బడి యక్షమావివశుఁ డై యచిరాంశులతావిలాసచం
చల మగులక్ష్మి కాసపడి సత్యము ధర్మముఁ దప్పి సత్సభా
వలిఁ దగువానియొద్దఁ దగువాఁడయి సన్నిధి నుండ నేర్చునే. 121

క. వగవంగ సాంగోపాంగము, లగునాలుగువేదములయు నధ్యయనము పా
ల్పొగ నొక సత్యముతో నెన, యగునే యొవ్వేతయున్న బోలువఁట సత్యంబున్. 122

తే. జనులు నిగ్రహానుగ్రహశక్తుఁ డైన, రాజశాసనమునఁజేసి రమణతోడ
నోలిఁ దమతమమర్యాద లొక్కటింపఁడుఁ, దప్ప నోపుదు రిమ్మహీతలమున నందు, 123

క. కడుకొని కఠినముఖులు లై, నెడ నుచితమె యాత్మనింద యొరయెచ్చుల ఘనం
బడలక యేకాకృతి నై, వ్వడు నుండుట యూనె పురుషపురుషార్థ మిలన్ 124

క. ఈలోకము యగుఁ గొందఱ, కాలోకము కొందఱకు నిహంబును బరమున్
నే లగు గొందఱ కధిపా, యేలోకము లేదు వినవె యిలఁ గొందఱకున్. 125

చ. ధనములు చాలఁ గల్గి సతతంబును నింద్రియపోషఁ సల్పుచున్
మనమున నెన్నఁడున్ సుకృతమార్గము వొందక లోభమోహ
మానిరతబుద్ధులై తిరుగునట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్
గనుటకు నేర రిప్పటిసుఖంబులు మే లయి తోఁచు వారికిన్. 126

క. అరులు మిగులఁ గాని రాజులు, నరులకు నెంతయును భయ మొనర్తురు ధరణీ
సురులు గడఁగి వాణిజ్యముఁ, గరిసనము జేయఁ గలరు కలికాలమునన్. 127

సీ. సస్యంబు నరులకు సంక్షీణ మగు, సస్యహాని నాయువు గడు నడఁగి పోవు
నాయువు దఱిఁగిన నల్పంబు లగు విద్యఁ, లల్పవిద్యుల విమోహంబు మిగులు
మోహంబువలనఁ బై మునురు లోభంబు, లోభావేశమునఁ గామ మగ్గలించుఁ
గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు, క్రోధంబున వైర మెంతయును బెరుఁగు
వైరమున నశేషవర్ణులు నన్యోన్య, పీడ సేయుదురు విభిన్నబుద్ధి
నొక్కఁ డొకని మేర నుండక వర్ణసం, కరము సేయఁ గలరు కలియుగమున. 128

క. జపనియమస్వాధ్యాయ, ప్రపంచములు విడువఁ గలరు బ్రాహ్మణులు జనా
ధిప! శూద్రులు విపులతపః, కృషితులు గాఁ గలరు వినవె కలికాలమునన్. 129

క. రసగంధద్రవ్యంబులు, పస చెడు సస్యంబు లల్పఫలము లగు మహిం
బవిపోఁడి దఱుఁగుఁ దరువులఁ, గుసుమఫలంబులును గరము గొంచెంబు లగున్. 130

మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బశ్యతో
హరులై సాధుల దోఁచి చేతురు తదీయస్త్రీధనక్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరంబై పెల్లు చెల్లుం బర
స్పరవైరంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణినాశంబుగన్. 131

క. క్రమమున రాష్ట్రములును నగ, రములును నాశంబు నొందు రక్షాచ్యుతులై
భ్రమియించెదరు జను లతిదు, ర్గమగిరిసరిదంతికములఁ గడు నాతురులై. 132

క. హేతుప్రత్యయవాదన, చేతను లై వేదనింద సేయుదురు మఖ
వ్రాతంబులు వ్రతములుఁ జెడఁ, బాతురు దుర్మార్గకర్మపరులై విప్రుల్. 133

క. శ్రుతిధర్మంబులు శూద్రులు, ప్రతిభం జెప్పంగ వినుచు బ్రాహ్మణజాతుల్
ధృతి చెడి తత్సేవకులై, యతినిందితకర్మకారు లయ్యెద రధిపా. 134

(భారతము.)

సీ. పదియాఱువర్షముల్ పరమాయు వయ్యెడు ధరణీశ కలియుగాంతమున వినవె
యేడు నెన్మిదియును నేండ్లప్రాయంబునఁ బ్రజ లుద్భవింతురు భామినులకు
ద్రవ్యవిహీను లై దాత యొక్కఁడు లేక యన్యోన్యతస్కరు లగుదు రెందు
నెఱిఁగెడువారును నెంతయుఁ గ్రూరు లై చెదరి పాపంబు సేసెదరు చూవె
యన్నవిక్రియ మొనరింతు రఖిలజనులు, వేదవిక్రయు లగుదురు విప్రవరులు
పణ్య (......) యగుదురు పద్మముఖులు, కష్టతర మైనయక్కలికాలవేళ. 135

మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులము లై విస్తీర్ణఘోరాటవీ
నివహాఖిలము లై యరాజకము లై నిర్మూలధర్మంబు లై
ద్రవిడాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తిదుష్టంబు లై
భువిలో నెల్లెడఁ బాడగుఁ జనపదంబుల్ తద్యుగాంతంబునన్. 136

క. క్షత్రియజాతులు శూద్రవ । రిత్రంబున శౌర్యమును సిరియుఁ దేజంబున్,
మైత్రియును లేక చెడి ధ । రిత్రీశ్వర శూద్రు లై చరించెద రెందున్. 137

క. ఊఱ వగు నారుగపంటలు । గొఱియలపాఁడియును దఱ చగుం బురుషులకున్
దెఱసలు నుట్టము లయ్యెడు । రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్ 138

క. నడవవు దేవపితృక్రియ । లుడుగును వేదార్థసమ్యగుపదేశంబుల్
గడఁగును మోహాతమంబులు । పుడమి సమస్తంబుఁ గుజనభూయిష్ఠ మగున్ 139

క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు । గురుఁడును శిష్యునెడ వంచకుండగు మది నొం
డొరువుల నొల్లరు బంధులు । పొరిఁబొరిఁ గఱ్ఱులగుఁ బ్రజకుఁ బొడమును భయముల్ 140

తే. క్రోధమోహనామకు లైనఘోరశత్రు । లిరువు రెరియించుచుండుదు రెప్పుడు నిరుని
నంతరంగ మయ్యుభయంబు నడపకున్నఁ । గలదెయూరక బ్రాహ్మణగౌరవంబు 141

సీ. ఎవ్వఁడు సత్యంబు నెప్పుడు బల్కు హింసావిముఖుఁడు గురుజనహితార్థి
యింద్రియంబుల నోర్చి యెల్లవారఁ దనయట్ల కాఁ జూచు ధర్మాభిరతుఁడు
కామంబు దగులఁడు కర్మంబు లాఱును సముచితసంప్రయోజ్యత నొనర్చు
నట్టిపుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁ డని యనిశంబుఁ గీర్తింతు రమరవర్యు
లార్జనంబు శమము నధ్యయనంబును, బరమధనము సుమ్మ బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియ తగుసాధనంబులు, వేదవిదితముఖ్యవిధులు నవియ 142

చ. అరయఁగ జీవితంబు గడునధ్రువ మింత యెఱింగి యాత్మ నె
వ్వరిదెసఁ గీడు సేయక ధ్రువంబగు మైత్రి భజించి సత్కృపా
నిరతుఁడు నిస్పృహుఁడు నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడుం
బరమశమాస్పదుండు నగుబ్రాహ్మణుఁ డొందు సనాతనస్థితిన్. 143
క. నిత్యముఁ గర్తయుఁ గర్మఠు నత్యాగియు నగుట లెస్స లౌల్యవియోగం
బత్యంతమయోగము దత్ప్రత్యయులత్యంతము నూవే బ్రాహ్మణుఁడుమహిన్ 144
ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును। నెజము శూద్రుకంటె నీచతముఁడు
సత్యశౌచధర్మశాలి శూద్రుం డయ్యు। నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు. 145
చ. నిజగుణదోషకర్మముల నెట్టిన మేలును గీడు వచ్చుఁ ద
త్ప్రజనితసౌఖ్యదుఃఖములఁ బ్రాజ్ఞులు దుల్యమనస్కులై మనో
రుజలను దేహజంబు లగురోగములన్ హితధర్మకర్మభే
షజములఁ జేసి పాపుదురు సర్వము సాత్త్వికదృష్టిఁ జూచుచున్. 146
క. ప్రియములఁ బాయుటయును న।ప్రియములఁ బెనఁ బొందుటయును బెల్లుగ నగుద
ప్త్రియలందు మూఢమతికి హృదయతాపము వాయదెప్పుడు దరికొనుచుండున్ 147
తే. వగతు మన్న సెవ్వారికి వగవఁ జనదు। చిత్తమున నేమిటికి సంతసింపరాదు
కాన గతమునందును ననాగతమునందు। వగవ రార్యులు సంతోషవంతులగుచు 148
క. వగపునఁ దేజోహీనుం డగు నాత్మహితక్రియలకు నక్షముఁ డగు న
వ్వగపు దొఱఁగియుద్యోగము। దగఁ జేయఁగఁ గలుగునంచితములగు శుభములన్ 149
తే. లోకములు లోకధర్మములున్ నృపాల। రాజయూలముల్ రాజవిరహితమైన
పుడమిజనులకు నింకినమడువులోని। జలచరంబులు పడుపాట్లు సంభవిల్లు.
ఆ. కోరి తోఁటవాఁడు కుసుమఫలంబులు। కోయునట్లు రాజు కొనఁగవలయు
నవ్వనంబు నతికి యంగారములు సేయు। భంగి నైన భూమి పాడుకాద. 151
క. నమ్మమి మృత్యువు పెద్దయు। నమ్ముట యపమృత్యు వగుట నరపతి నమ్మీ
నమ్మక పని గొనవది ని। త్యమ్మును నాత్మమతిఁ దాన యరయఁగవలయున్. 152
క. మృదుమధురవాక్యములు ని౦। పొదవెడు చెఱువవ్వులోడ నుర్వీశుఁడు స
మ్మదమున సచివులకుఁ బ్రజలకు। నొదవింపఁగ వలయు నదిమహోన్నతిఁ జేయున్. 153

—భారతము—

క. శరణంబని వచ్చిన భీ । కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరులకెఱింగిది । యిరవుగ సరి గావు దీని కేధర్మంబుల్. 154

క. విను దుర్వినయాత్మకుఁ డగు । జనుఁ డుజ్వలమైనసిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగ నేరక । చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్ 155

తే. పిఱికితనము నేమఱుటయు మఱుపలేనము । మెత్తబాటును గార్యంబు నెత్తెఱంగు
నేరమియు విషయంబులఁ గూరుటయును । గలుగుపతికి నుండదు సిరి దొలఁగిపోవు

క. క్రమమున బాహ్యేంద్రియక । ర్మము లెల్లను వదల విడిచి మహితసమాధి
క్రమదశ నుండె నివాత । స్తిమితం బై వెలుఁగు చున్నదీపమపోలెన్. 157

క. క్షమయు నహింసయు సత్యము । సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు । గ్రమమున నిన్నియును స్వర్గగతికారణముల్. 158

శా. అన్యాయార్జితమైనవిత్తమునఁ జేయం బూనుదానంబు మూ
ర్ఖన్యాయం బది దానఁ జేసి ఫలపాకం బేమియున్ లేదు యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాన్యం బై తగఁ బాత్రయోగమున సౌమ్యం బై ఫలించుం దుదిన్. 159

ఆ. ఆత్మధర్మనిరతులైనపుణ్యాత్ములు । దుర్లభులు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ దీర్థ । భూతమతులు వారు భూతలమున. 160

ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగుసౌఖ్యదుః । ఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబు లివి సర్వధని యనఁ । బరఁగుఁ జావ్వె యట్టి భవ్యుఁ డనఘ. 161

క. మన్నన కుబ్బక యవమతి । దన్నొందిన స్రుక్కఁ బడక ధరణీశుకడఁ గా
మున్నున్నయట్ల మెలఁగిన । యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్. 162

ఆ. యోగ్యతృష్ణఁ దగిలి యుచితంబు గోలఁదిమై । నడచునట్టివారు బెడిదములకు
నంత సొత్తు రెట్లు సంతాపకారుల । కాక పెనఁకునలు సుఖంబు లగునె. 163

క. బలవంతుఁడు పై నెత్తిన । బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, మ్రి
చ్చిల వేచువాఁడుఁ, గాముఁ । కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 164

క. కోపము, నుబ్బును, గర్వము, । నాపోవకయునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము ననువివి । కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 165

క. చెడుపడి యనుమున్నిటిం । గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నొడఁగూడు ననిన సత్యము । గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 166

ఆ. కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి । చేటె కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుడుఁ గోయ ఫల మిచ్చుఁ జెడదు బీ । జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 167

తే. మాలకరిపుష్పములుగోయుమాడ్కిఁ దేఁటి। పువ్వుఁ దేనియఁ గ్రోలెడుపోల్కి నెదురు
గందకుండఁగఁ గొనునది కార్యఫలము। బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁ జనదు. 168

ఆ. కలహ మగుడు లక్ష్మి గావించుఁ బ్రాణహా । నియును జేయు నింత నిక్కవంబు
పలువు రొకని కోడి పాలుట బల్లిదు । లనదచేతఁ జెడుటయును ఘటించు. 169

క. పగవారియింటఁ గుడిచిన । నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ । దగ దొడలుల కెప్పు డెవ్విధము వాటిలునో. 170

క. దొరఁకొని పుణ్యముఁ బాపము । నరుఁ డర్థిం జేయు చుండ నడుమ నొకంటన్
వెర నెడలి తప్పినను ద । త్ఫలితఫల మొందు నంద్రు ధర్మవిధిజ్ఞుల్. 171

ఉ. సారఁపుధర్మమున్ విమలసత్యముఁ । బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాలివి యైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును నైన ముంజెడున్. 172

క. బలవంతులబలములు న । గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము । నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 173

చ. బవరము సేయు చుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
సవినయవృత్తి మై వలవ దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు వడిఁ దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను గాను వధింపఁగ శస్త్రవిత్తులన్. 174

క. పురుషుఁడు పెడు ననువాఁడును। బురుషుఁడు సెలుచు నని పలుకుపురుషుండును న
య్యిరువురు యవివేకుల యు। ప్పురుషుఁడు సెలువందు సెడఁడు భుజవీర్యనిధీ 175

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ। జేతోమోదమున కెలిఁగి చెలు వొందుదు ర
స్నాతిం బాసిన విగతివి। భూతిం గడకొని వ్రీలట్లు పొగయుదు రధిపా. 176

క. శరణం బని వచ్చిన భీ । కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరుల కెఱుం గిది । యిరవుగ సరి గావు దీని కేధర్మంబుల్. 154

క. విను దుర్వినయాత్మకుఁ దగు । జనుఁ డుజ్జ్వల మైనసిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగ నేరక । చెనఁటి యెఱుంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్. 155

తే. పిఱికితనము నేమఱుటయు సుఱుకతనము । మెత్తబాటును గార్యంబు నెత్తెఱంగు
నేరమియు విషయంబులఁ గూరుటయును। గలుగుపతికి నుండదు సిరి దొలఁగిపోవు

క. క్రమమున బాహ్యేంద్రియక । ర్మము లెల్లను సడల విడిచి మహితసమాధి
క్రమదశ నుండెడి నివాత । స్తిమితం బై వెలుఁగు చున్నదీపముపోలెన్. 157

క. క్షమయు నహింసయు సత్యము। సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు । గ్రమమున నిన్నియును మోక్షగతికారణముల్. 158

శా. అన్యాయార్జిత మైనవిత్త మునః జేయం బూనుదానంబు మా
ఘ్న్యాయం బది దానఁ జేసి ఫలపాకం బెన్నియున్ లేదు యు
క్త్యన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాత్రస్యం బై తగఁ బాత్రయోగమున సౌమ్యం బై ఫలించుం దుదిన్. 153

ఆ. ఆత్మధర్మనిరతు లైనపుణ్యాత్ములు । దుర్లభులు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ దీర్థ । భూతమతులు వారు భూతలమున. 160

ఆ. ప్రియము నప్రియంబుఁ బె ల్లగుసౌఖ్యదుః । ఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబు లివి సర్వసని యనఁ। బరఁగుఁ జువ్వె యట్టి భవ్యుఁ డనఘ.161

క. మన్నన కుబ్బక యవమతి । ద న్నొందిన స్రుక్కఁ బడక ధరణీశుకడన్
ము న్నున్నయట్లు మెలఁగిన। యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్.162

ఆ. రోగ్యతృష్ణఁ దగిలి యుచితంబు గొలఁది మై । నడచునట్టివారు బెసిదములకు
నంత సొత్తు రట్లు సంతాపకారుల । కాక పెనఁకునలు సుఖంబు లగునె. 163

క. బలసంతుఁడు పై నెత్తిన । బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, మ్రి
చ్చ్రుల వేచువాఁడుఁ, గాముఁ । కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 164

క. కోపము, నుబ్బును, గర్వము, । నాపోవకయునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము ననునివి । కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 165

క. నడపడి యనుమున్నీటిం । గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నోడఁగూడదు ననిన సత్యము । గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 166

ఆ. కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి । చేటె కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుడుఁ గోయ ఫల మిచ్చుఁ జెడదు బీ । జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు.167

తే. మాలకరిపుష్పములుగోయుమాడ్కిఁ దేఁటి।పువ్వుఁ దేనియఁగ్రోలెడుపోల్కి నెదురు
గందకుండఁగఁగొనునదికార్యఫలము।బొగ్గులకుఁబోలె మొదలంటఁబొడువఁజనదు.168

ఆ. కలహ మగుడు లక్ష్మి గావించుఁ బ్రాణహా । నియును జేయు నింత నిక్కువంబు
పలువు రొకని కోడి పాఱుట బల్లిదు । లనదచేతఁ జెడుటయును ఘటించు. 169

క. పగవారియింటఁ గుడిచిన । నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ । దగ దొడఁబుల కప్పు డెవ్విధము వాటిలునో.170

క. దొరఁకొని పుణ్యముఁ బాపము । నరుఁ డర్థిం జేయు చుండ నడుమ నొకంటన్
నెర వెడలి తప్పినను ద । త్ఫలితఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్. 171

ఉ. సారఁపుధర్మమున్ విమలసత్యముఁ । బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాలివి యైనయవస్థ దత్తు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును గైవ ముండెడున్. 172

క. బలవంతులబలములు న । గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదులువారికి గర్వము । నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 173

చ. బవరము సేయు చుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
నవినయవృత్తిమై వలన దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు పడిన దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను గాదు వధింపఁగ నెట్టిశత్రునిన్. 174

క. పురుషుఁడు సెడు ననువాఁడును। బురుషుఁడు గెలుచు నని పలుకుపురుషుండును న
య్యిరువురు నవివేకుల యా। ప్పురుషుఁడు గెలుచుండు సెడఁడు భుజవీర్యనిధీ175

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ। జేతోమోదమున వెలిఁగి చెలు వొందుదు ర
న్నీతిం బాసిన విగతివి। భూతిం గడకొలవులట్ల పొగయుదు రధిపా. 176

క. తేరు శరీరము, దానికి। సారథి సత్త్వంబు, తురగచయ మింద్రియముల్,
గారుణ్యతరబుద్ధివ్యా। పారంబులు దనరు జనుపసర్గము లధిపా. 189

క. కలిమియ చుట్టలఁ జేర్చుం। గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వాలుఁ దనిపించుం గలిమియ। పలువురు సద్బుద్ధి యనఁగఁ బరఁగం జేయున్. 190

క. కేవలనిష్కామ్మతి మో। క్షావహ మగు నేని గిరులు నదీజములున్
భూవర! ముక్తిం బడయం। గా వలదే యడవి నునికి కైవల్యదమే. 191

చ. వినుము తమోమయం బయినవిశ్వముఁ దా వెలిగించు నీశ్వరుం
డన నొకరుండు సద్గతి నాశ్రితకోటిని వాఁడు గాడ చే
సె నిఖిలకర్మయోగవిశేషతి గల్గుటయుం బడియక
ల్పనమ శిదాజ్ఞకుం దొలఁగఁ బాడిరె లోకము గారణంబుగన్. 192

క. రక్షకుఁ బ్రజ గోరు నిజమో। గక్షేమార్థముగ జనసుఖస్థితి నడపన్
దక్షుఁ డగు రాజు నడపకు। పేక్షించిన బాప మొందదే కురుముఖ్యా. 193

క. నరరూపంబునఁ బరఁగెడు। పరదేవత గాక నృపుఁడు బాలుఁ డయిన న
వ్వరుషునెడ నేమి పొమ్మని। తిరిగినదుష్కృతులఁ బొందదే క్షితిపా. 194

క. దండార్హులైనవారల। దండింపక యున్నఁ జూడ్వె దాత్రీవిభు నా
ఖండలసన్నిభు నైనఁ బ్రి। చండపుగిల్బిషము వొందు జగతీనాథా. 195

క. పేదలకును సాధులకును। వేదములకుఁ దాపసులకు వేయేల సమ
స్తానిత్యులకును దండము। కాదె బ్రదుకుఁ జేయు రాజు గావింపంగన్. 196

ఆ. ఉచితదండవృత్తి నుర్విప్రజాభిర। క్షణము నోపి చేఁత గాక రాజ
వంశజునకు ధర్మవా భూసురార్చనంబు। వైశమపమాదు లాస్య నిడుట. 197

తే. కామభోగముల్ మే లనగాదు వాని। విడిచి చూడుము పొందెదు విఫ్రలసుఖము
కాయ లాకులు నీళ్ళును గాలి యనుభ। వించియున్న మునీంద్రులు వెఱ్ఱివారె. 198

క. దుష్కృతు లామిషగత మగు। కర్మము వాటించి బంధ కలితు లగుదు ర
య్యాశ్మి గడచి సువిచారులు। నిర్మమతను ముక్తి వడయ నేర్తురు వత్సా. 199

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రములయర్థము లారఁగఁ గ్రోలి తత్త్వసం
వేదనుధారసంబునఁ జవిం జిరసౌఖ్యముఁ బొంద నేర క
మ్మేదిని నెందునుం దిరిగి మే లని కర్మము యూఁది చెప్పుచుం
గా దని శాంతి యొప్పనిది గాఁ జెడనాడుదు గల్పబోధనుల్. 200

క. విమలజ్ఞానముఁ దపమును। దమమును త్యాగంబు శాశ్వతప్రచురానం
దమునకు మూలము లందురి ని। జముగాఁ గైకొం డ్రివియ ప్రసన్నవివేకుల్ 201

ఉ. కామముఁ గ్రోధమున్ మనను గాసఁగఁ బాలుట మాన్చి యింద్రియ
స్తోమవిమార్గవర్తనము దుంచుచు నెవ్వగ లేక రక్షణం
బేమఱ కెవ్వరిం జెనకి యించుక నొంపక లోక మేలఁగా
నామహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు (నిప్పలున్.) 202

ఆ. న్యాయశాస్త్రవేది యై యింగితాకార। చేష్ట లెఱిఁగి జనుల శిష్టదుష్ట
తావిశేష మరసి దండనీతి యొనర్చు। పతికి నెల్లమేలు నడయ వచ్చు. 203

క. అరి యాఱివపాల్గొనుచుం। గరుణ గలిగి ప్రజలఁ దండ్రిగతి మధ్యస్థా
చరణంబునఁ బాలించుట। పరమపదముఁ జేర్చు (నోడుచు) భయసంశయముల్ 204

చ. క్రమమున నెట్టిశాత్రవులఁ గ్రిందున నైనను జూడఁ జేఁత ధ
ర్మము విను పాపకర్ము లగురాజులతోఁ దగ సంధి సేఁత దో
షము విభుఁ దుర్వి యమ్ముకొని సంగరముం దొలఁగింపఁ గూడునే
సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండుధర్మముల్. 205

తే. కల్లు ద్రావుట గురుపత్నిఁ గవయుటయును। విప్రుఁ జంపుట బ్రహ్మస్వాపహరణనైజ
ముచ్చిలుటయును నివి గలవారిజనులఁ। బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు.

క. వినుఁడీ సుఖమును దుఃఖము। ననిత్యములు గాన హాని యాగమకాలం
బున ముదమును శోకము మొగి। కొనమియు చమ్మ్రవు శాంతి గోరుజనులకున్

తే. మూఢతమబుద్ధు లగువారుఁ బ్రౌఢతమవి। వేకు లగువారు సుఖు లట్లు గాక కొంత
ప్రజ్ఞ గలవార లై యపప్రతిభు లైన। జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు. 208

తే. పాదలుఁ దఱుఁగుటకై పాద వెదుగఁబడుట। కైకడుం జేయఁ బాయుటకై జనించు
బొలియుటకునై సుఖంబులఁ బొందుదుశిఖి। యొంచుటనునై పదార్థము లెందునధిప.

చ. పల నధికంబుగాఁ గలుగు వైద్యులు శాస్త్రము లభ్యసించి మం
దుల నొడఁగూర్ప నేర్చి తనుదోషము లాగయుబుద్ధి గల్గి యా
ర్తులకుఁ జికిత్స సేయుదురు రోగము వాయమి లేద వారు రో
గు లగుట గాన మెల్లు ప్రతికూలవిధిన్ నడునెవ్వ దోఁచునే. 210

క. జననజరామరణగ్రాహి। హానిబిడకాలాబ్ధిమగ్న మని జగము నెఱిం
గినవాఁడు ధర్మవర్తన నము। నుండుం జింత పక్కి భూపవరేణ్యా. 211

క. తనయొడ లెరవనినను మను। జునకును బంధుతతి సతమె శోకించిన వ
చ్చునె చచ్చినజంతువు నె। మ్మన మధికము నొచ్చుఁ గాక మహితవిచారా. 212

తే. మాతృపితృదారపుత్రిక(భ్రాతృశతస। హస్రకంబులు సంసృతి ననుభవించఁ
బడియె నం దెవ్వరికెవనియడలువాఁడు। నరుఁ డనిత్యత యూహించు టగయ నుఱవు.

క. నరవర సరసాన్నంబులుఁ। బరిమళసద్వస్తువులును బరమశయనవి
స్ఫారములుఁ గాలాధీనా। నరుఁ బొందుం బాయు వాని నమ్మమియ యుఱున్.214

మ. మనుజాలు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెన్నెడుఁ
గినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాప మెం
దు నొకొ కుఠారమున్ జనులు దోసముఁ బొందరు కర్త యీశ్వరుం
డనియెడినిశ్చయంబు దృఢమై మది నిల్వఁ జాలు భూవరా. 215

క. దురమునఁ గైదువుఁ గొని తను। బొరిగొను నేతెంచునట్టిపురుషుని వేదాం
తరహస్యవేది నర్గుబనను। బొరిగొనినం బాతకంబు పొందదు వత్సా. 216

తే. అతిథిపితృదేవతాపూజ లాచరించి। కాని గృహమేధులకు భోజ్యమైనఁ గుడుపఁ
దగదు యజ్ఞశిష్టం బమృతంబు గాఁగ। నార్యజనములు సెప్పగు రధిపవర్య. 217

క. ఆలును బిడ్డలు బంధులు। నై లీలఁ జరించుచును గృహస్థుఁడు పర్త్తో
ల్లోలత్వారహితచిత్తత। మేలుగ నలవఱుప వలయు మీఁ దెఱిఁగి నృపా. 218

తే. పండునకు బిడ్డ నిచ్చినచంద మొందు। బూదిలో నేయి వేల్చిన పోల్కి నోటి
కడవలో నీళ్ళు నట్టినకరణి యగు న। పాత్రజనులకుఁ బెట్టుట పారవేంద్ర. 219

క. శిల చేతమ్రాను దెప్పగ। జలనిధిఁ గడవ దొరఁకొనినచా ప్పగుఁ బాత్రం
బులు గానివారిపల దానం। బులఁ బాపము నిస్తరింప బుద్ధిఁ దలఁచినన్. 220

ఆ. ప్రసకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ। ల్లధికనింపఁ బోరయూరట్ల దుష్ట
మై యపాత్రవిషయ మగునీగి నృధవోవు। నిమ్ముచోటఁ బాత్రి మెఱుగవలయు221

ఉ. రాజటె రాగహీనుఁ డటె రాజితసుందరమూర్తి యట్టె వి
భ్రాజితసంపదున్నతివిభాసితుఁ డట్టె కామినీ
రాజిమనోజ్ఞభంగిచతురస్వధనుఁ డటె బ్రహ్మవాద్యదీ
త్రాజితమస్త్రసుందరు నటె జన్మము లెట్టివి యొందుఁ గల్గ నే. 222

క. తరణి వొడిచి తమము వెలుచు। కరణిని లోకమునఁ గలుగుకల్మష మెల్లన్
ధరణిపతి ధర్మమార్గ। స్ఫురణంబునఁ జెఱుచు విమలబోధచరిత్రా. 223

క. దాంతియుఁ బ్రియవాదిత్వముఁ। శాంతియు శీలంబుఁ గలుగుజగదీశుఁడు శ్రీ
మంతుండు యశస్వియు నై। యెంతయు సౌఖ్యంబు నొందు నిభపురనాథా. 224

తే. ప్రకృతు లేడింటిఁ దగ నడపంగవలయు। దాని కార్యసత్వముల్ దావలములు
దండనీతివిధాన మంత్రటికి రక్ష। యర్హ మగు మెల్పుతోఁ జేయ నది వెలుంగు. 225

క. గురుతల్పగు భూమిహునిన్। నరేంద్రవిద్వేషి బ్రాహ్మణఘ్నునిఁ జెలువన్
ధరణి వెడల నడువవలయు। శరీరనిగ్రహము సేయఁ జనదెయ్యెడలన్. 226

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం బ్రహ్లాదముం బొందుభూ
వరునాజ్ఞం జన కీగి మెచ్చరు పనిన్ సంచింతు రగ్గాడిఁ జో
త్తురు కౌతూహలవేషభాషణములం దుల్యత్వముం బొంది యే
తురు వా రెల్లపదంబుఁ గోరుదురు గొందుర్ భూమి మాఱోడ్డులన్. 227

క. అవలేపంబునఁ గర్త। వ్యావివేకము లేక వలసినట్లాల యెవ్వరి
దపనీతి సేయు ధరణీ। ధవుఁడు విడువవలయుఁ దన కతఁడు గురుఁ డైనన్ 228

క. పొనరిచి యాడెడుమాటలఁ। గొనఁ దలఁపక దుర్వినీతకోటిగణంబుల్
దన కెక్కినట్టితప్పులఁ। గొని సుజనుల కీగి నృపతి గుణ మందుఁ బుధుల్. 229

క. ధన మపహరించుటయు। తన కనిశముఁ జనిగాఁగ బ్రదుకు సతిలుబ్ధకున్
విను శత్రులచే నాటకు। మును దనప్రజచేతఁ జేటు మూఁడు నరేంద్రా. 230

ఆ. ధర్మరతులు సర్వనిర్మాణచతురులు। లౌల్యరహితులును నలంఘితాజ్ఞ
లును సునీతినిపుణులును గులజులు నగు। పరిజనములఁ బెనుపు పతికి హితము. 231

ఉ. కానిపథంబునం జనక కారుణికత్వము గల్గి శాంతిమైఁ
దా నడపంగ విప్రివ కుదార్థనం బొడగూడ దేని సం
తానము పూర్వ కర్తలకు ధర్మనిరూఢతఁ బంచి పెట్టి దు
ర్మానవిదూరుఁ డై పరఁగఁ బ్రాప్తుఁడు కౌరవవంశదీపకా. 232

చ. యజనము దానకర్మమును నధ్యయనంబును దస్యుహింసయుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేఁతయు సంగరంబునన్
విజితవిభీతిమై మరణించుటయున్ నృపధర్మముల్ గురు
ప్రజతిలకాయమాన సమరంబు సుధర్మువు వీనిలోపలన్. 233

మ. గురుశుశ్రూషయు నాగమాధ్యయనముల్ గోష్ఠీనిరాసంబుఁ ద
త్పరతం బొందఁ దొరయంగఁ దాఁ జోరమిచ్చుక్ భైక్షాశనత్వంబు స
ద్వ్రతకర్మంబులయందు రాగభరగాఢద్వేషముల్ లేక యీ
ష్వరితోషంబగ గాక యున్కియును భవ్యబ్రహ్మచర్యోక్తముల్, 234

శా. తానుక్ భార్యయు నేఁగుఁ బేరడవికిం దా నొక్కఁడైనం జనున్
మానాహంకృతు లూడ్చు నింద్రియములక్ మర్దించు నచ్చో జడల్
పూనుం దాపసశాస్త్రముల్ సమువ? ల్పున్ గోష్ఠి తజ్జాళితో
వానప్రస్థవిధాప్రవిష్టుఁడు ప్రశాంతవాత్సల్యనిష్ఠాత్ముఁ కా. 235

శా. ఎచ్చో నైనను నిల్చు నాతలికి నేమేనిం గొనుక్ రాత్రి యై
నచ్చో నెమ్మి శయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించుఁ దా
నిచ్చం గోరఁడు కొండు నింద్రియజయం బేపారుభోగంబులక్
మెచ్చక్ మొక్కునను నొల్ల కుండు యతి పేర్మిన్ నిర్మలుం డై నృపా. 236

క. తరణిశశాంకుల తేజ| స్స్ఫురణము లేకున్న యట్లు భూజనములు ని
ర్భరదురితలఁ జెడ్డుదురు| నరపాలకహితపాలనము లేకున్నక్. 237

క. రాజునకుఁ బ్రజ శరీరము| రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయుక్
రాజోత్తము యన్యోన్యవి| రాజితు లై యుండ వలయు రక్షార్చనలక్. 238

క. తనుఁ దాన తొలుత గెలువన్| మనుజపతికి వలయుఁ బిదప మార్తుర గెలువన్
మనమునఁ దలంచునది మును| దను గెలువనిపతికి గెలువఁ దరమే పగఱన్ 239

క. ఆరామాదికనిజసం| చారస్థలములకు దేశసంధులకుఁ బురీ
ద్వారములకు నగరికిని ధ| రారమణుఁ డొనర్పవలయు రక్షలు నియతిన్. 240

తే. అర్థులకడ నిజభూమియం దనుజతనుజ| బాంధవామాత్యమిత్త్రుల పాల వేస
ధనుల వేగులఁ గాఁ బెట్ట ధరణిపునకుఁ| వలయు నొండొరు నెఱుఁగనివారు గాఁగ

ఆ. కయ్యమునకు వలదు కాల్దివ్వ నధిప సా| మమున భేదమునను మార్తుమనము
మెత్తఁ జేసి చెతిచి మేవడిఁ దప్పించు| కొను తెఱం గెఱింగి కొనుట మేలు 242

చ. జనకుఁడుఁబోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు షష్ఠభాగముం
గొనునది వారిచేత నరిఁ గోటివిధంబుల నాస్తదత్ములం
గని జనగోకులాకిరణపరిముఖాగ్రకరంబు లారయం
బనుదుము సన్నిటన్ ధరణిపాలుఁడు గన్నిడి యున్నఁ బెం పగున్ 243

తే. తనకు మేలొనరించునాతండు మిత్త్రుఁ డతఁడు నడపంగ నెల్లకార్యములు శుభము
నొందు నేమిట నేమఱకునికితోడ నృపుడు మిత్త్రుపైఁ గార్యముల్ నిలుపవలయు.

క. బలఁగము గలభూపాలుఁడు గెలనిమహీశ్వరులబుద్ధికిని వేఁగుచున్
బలియుఁ డసు లేనివానిం జలకనగాఁ జూతు రెట్టి శూరుం డైనన్. 253

క. ఎక్కువతక్కువమాటలు నుక్కివములు నెందుఁ గీడు నొందించుటయుం
జెక్కు దనయన్నదమ్ముల దిక్కున సన్నియును సైపఁ దేజము సేయున్. 254

క. లోపల రాఁజుచుఁ బొగయుచుఁ గోపంబులు దలఁతు రోపి బలిమియు వెఱపుం
జూపక తక్కువ కెలనికి నేపాటను వారి నడపు కొంతయు నొప్పున్. 255

క. మృదుమధురవాక్యముల నిం పొదవెడుచెలువున్నవృత్తితోడ నుర్వీశుఁడు స
మ్మదము సచివులకుఁ బ్రజలకు నొదవింపఁగ వలయు నది మహోన్నతిఁ జేయున్

క. నలుకుట యర్థముఁ గొనుటయుఁ జెఱ నునుచుట కట్టి యడిచి చేడ్పా టొందం
బఱచుట మొదలుగఁ గలపలు దెఱఁగులఁ దగు మెయిని నడపు ధీరవిచారా. 257

క. తనకు డకు వచ్చి మొగి మో దనివాఁ డసుమాత్ర వల్కుటకుఁ గోపింపం
జనదు జననాథునకు దూతునిఁ జంపిన నరకె మగుట ధర్మ మని రాజ్యుల్. 258

తే. కులము శీలంబు హితవాక్యములును చెప్పుఁ గార్యవాదిత్వసద్వ్యవహారగౌరవంబుఁ
దలఁపు గలుగుట దక్షత యలఘుగుణము లందుఁ గ్రమాతకు నియోగ్యదు వార్యజనులు.

క. మొన దీర్చువెరవు యంత్రము లనేకము లొనర్చు నేర్పు నాయుధముల వి
న్నను వును బోలులక్షం బును సేనాపతికి నైజములు గా వలయున్. 260

క. తనయుల నైనను నమ్మఁడు జనపతి సిరి గోలుపోవుఁ జతురత మైన
న్మిత్రవాఁడపోలె నమ్మక యునికి సకలజనులయెడల నుగ నై యుండున్. 261

క. చోరులచేఁ జెడ కుండం గ్రూరులచేఁ జావ కుండఁ గుసలయజనులన్
జారులచేఁ బడ కుండ ధరారమణుఁడు నేర్పు గలిగి రక్షింపఁ దగున్. 262

క. అవు దేహోమముఁ గృషి చేయుటను వనగులును బనులసొంపు వరి యగ్లగుటన్.
భువి బలువు గలుగుకాఁపులు వనిశుఁడు గన్నుగ్రనబల యా గ్లొయఁ దగున్. 263

క. అరి మిగులఁ గొనుట క్షీరపులఁ। బోరిమాలఁగఁ బిదికినట్లు భూవర కదుపుల్
వెరవునఁ బెనిచినయట్లగు। నరపతి ప్రజచేత నప్పనము దగఁ గొనినన్. 264

క. విను కర్షకులును వణిజులు। ననఘా గోరక్షకులు ధరాధీశునకున్
ధన మొదవగా డెదువోటులు। కనేకవిధములకు నెల్ల నావ్యస్థలముల్. 265

తే. ధనములకు ధాన్యములకు నుత్పత్తిస్థలము। లయినవాని కించుకయును హాని గాక
యుండఁ దనకును బండారమొదవఁ దగును। పాలనము సేయ వలయు భూపాలకుండు

క. పులి గూనలఁ దినుచందము। గలిగిన నంతటన నిలుచుఁ గాక ధనంబుల్
గలుగునె మీఁదం గావున। జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్. 267

క. అరయుటఁ బ్రజ వర్ధిల్లఁగ। నరి యేఁటేఁటఁ గ్రమవృద్ధి యానట్టులుగా
నరపతికిఁ గొనఁగ వచ్చు। స్వైరవృత్తిఁ బెంపంగఁ జాల నెఱయు ధనంబుల్. 268

క. దమియింపఁ దగినవారల। సమయమున దమించి వారి సంపదలు మహీ
రమణుండు దనదుబండా। రముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. 269

క. అపనికిఁ గీడు దోయము। భూపాలుఁడు ధనము గలుగు పురుషుల సిరిఁ దాఁ
జూపోపక కొనఁదగదు ద। యాపరుఁడై పెంప వలయు నఖిలజనములన్. 270

క. ఆయతి కిమ్మెయిఁ గలుగును। పాయంబులు ధర్మమార్గఫలితంబులు గాఁ
జేయుటయ మేలు నృపతికి। మాయాకృతినిపుణుఁ డగుట మతి గాదు సుమీ. 271

తే. భూతవృద్ధులు ఘనలాభములును గలుగు। ధర్మమునను రాజనువాఁడు ధర్మరతుఁ
డై జనించెను గావున నతఁడు దోష। కాముఁడై ధర్మనిరతుండు గాఁగ వలయు 272

మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగ న
ధ్ధగపున్ విఘ్నము లేక యుండుఁ బ్రజకున్ దైన్యంబు వాటిల్లుఁ బె
క్కురుజల్ పైకొను నెందునుం గలయ నుక్కుం దేజముం దక్కు ను
ద్ధరసైన్యంబుల శస్త్రలాఘవము బంధుశ్రేణికిం జేటగున్. 273

క. కాని చెయిదములు సేయక। మానధర్మమునను నడచు నుర్వీశుఁడు సం
తానము బంధులుఁ బ్రజయును। హానును సేనలును శుభము నలరొనఁ జేర్చున్ 274

ఆ. అర్థసిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మ। సిద్ధి దాన సకలసిద్ధులును బ్రి
శస్త్రభంగిఁ జేయు శాశ్వతకీర్తియు। సంభవించుఁ గలుగు సద్గతియును. 275

క. ధనమున్నకై ధర్మము దెస। ననాదరము సేసెనేని నానృపతికి న
ర్థనమును జెడు దుర్యశముం। బనుగొను మరి దుర్గతియును వాటిలు ననఘా. 2 76

క. ధర్మపరిప్రాప్తి యయ్యెను। ధర్మము నా కింతకంటెఁ దత్త్వాధులం
జేర్మిం బోరయ నలయు నను। ధార్మికతాస్పష్ట నత్యుదాత్తుఁడు వొందున్. 277

క. మూలబలము సంతుష్టం। బై లాలితమగుచు నున్నయప్పు డసమునో
టాలోకించి నవని భూ। పాలసనకు పంప మతిశుభం బొనరించున్. 278

చ. సమరము సాహసం బధికసంపద లబ్బియుఁ జెచ్చికోలు ప
థ్యమె రిపు లేల కల్గు రహంకృతి పెంపను నుత్కటంపుఁగో
పము మరిడింపఁ జాలునరపాలున కబ్బునటుల్ హితంబు సా
మము వినయాంతరంగ: మయుచమాననానునెమన్ మహేశ్వరా. 279

క. తినఫలములు గలఁగినప్పుడు। ధన మిచ్చి విరోధి నల్పతరు నైనను శాం
తునిఁ జేయ వలయు దానము। నన యాధిపునిఁ జేస్కు టుగవు నరపతి కెప్పుడున్. 280

క. విను చిల్లి యుడినయాయుధ। మును విషలిప్తముగశస్త్రమును నెట్టియమి
త్తునిపై నైనఁ బ్రయోగిం। చినసరపతి నరకమును నసించు నృపాలా. 281

క. శరణాగతుఁ గాచియు నవి। నరపాలురఁ బట్టిఁ జెచ్చి యారసియు ధరణీ
సురలం బోషించియు నానా। ధ్వరములు సేసియును రాజు దలఁగు దురితముల్. 282

క. చరులఁ బనిచి యాపులతెఱం। గెరయుము నా రెరుగు నమమన్నట్టి దయిన దె
ప్పరఁ బ్రుంజెయవున డప్పిం। బొరసినయెడ విడియుచోట బొడుము టుగ నగున్. 283

ఆ. నిమగపోవుచోట నీరుదొరికెడుచోటఁ। గూడు దినెడుచోటఁ గోటకి సొలసి
నప్పుడుఁ జెవరి యున్నవనసరమునఁ బగ। వానిఁ బొడవి చెఱుప వలయు నధిప. 284

తే. పను లేనుగుఁ జేర్చిన క్లిష్టక మోసఁగు। సంగమున పెంపుఁ బలికిని సింగమునకుఁ
బట్టిట్టియుగ్రతయును గట్టి మొనయు। వలను గలయోధవీరులు వలయు నసికి. 285

క. నైరిపులమువము లుత్సా। హోనూనము లగుచు నుండు నాయాహేపాయముల్
పినులపను సాగియుండుగ। జాసికము లుబ్బ విజయ మగు నైన్యమునకున్. 286

క. క్షమ మేలగు నైన నతి। క్షమ దైన్యముఁ దెచ్చు నెదురు గర్వించినఁ గ
య్యమున వోడించి గెలిచి యరిశే। షమునెడ సదయత్వమావిశదుఁ డగుటొప్పున్ 287

చ. అరిపయి వీఁక నెత్తి చనునప్పుడు దేనియ లుట్టునట్లుగా
నరపతి వారివారలు వినం బ్రియ మాడుట మేలు, పక్షిఁ దాఁ
దిరముగఁ జేరఁగా మృగము తేఁకువ వాపను వేఁటకాఁడు త
త్స్వరములు నూపి కాదె తుది జంపఁ దగుం దనబారిఁ బాఱినన్ 288

క. కాలవిపర్యయమున నర। పాలుఁడు దా మ్రొక్కి క్రిందైనఁ బగతుఁ గలసి త
చ్ఛీల మెఱిఁగి తఱి రాఁగ। గాలునిపురి కనుచునది సుకరముగ వానిన్. 289

క. అవమానంబును జెడిపుఁ। దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెడు నే
అనుబోలె నొత్తఁ లయ్యును। మనుజేంద్రుఁడు మార్తాండం గ్రమంబున నధిపా 290

క. పెక్కండ్రితోడ నీరస। మెక్కటి తఱిన గొనక తఱిఁగి యున్న పగరతో
ను గ్రక్కున బంధుభావముఁ। జిక్కటిపగరయొకొ పలయుఁ దా నెఱపంగన్. 291

తే. అర్థవంతుఁడై భోగంబు లనుభవించు। చున్నయప్పుడ యిది యిట్టులుండ నేర
దస్థిరము తానులోనుగా నని యెఱుంగు। నతఁడు వగ బొందడేని యొక్కైన నధిప. 292

క. కానియటు లుండి నెఱిఁ బడు। నైన తెఱఁగు దోఁచి మాయ మను నిల్పంగిన్
మానసమున కుబ్బ వగయు। దేనోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్. 293

క. గతమునకును వగవక యా। గతమునకును నోపు తెలిచి కడుఁ బోఁక దీ
నతఁ బొందక నైజం జే। గతి బంచిన దానఁ బోదుఁ గా కననలయున్. 294

క. వేనను లావును గిలిగిన। పురుషులు లేరెల్లు లోకమున నెవ్వరికిన్
సిరి శాశ్వతంబె యని నగఁ। బోరయాఁడు ధీరుండు కలిమిపోకకు నధిపా. 295

క. ధర్మ మధర్మముభంగి న। ధర్మము ధర్మంబుమాడ్కిఁ ధరలోఁ దోఁచున్
నిర్మలమతి నరయ నలయు। ధార్మికతన కోమవాఁడు తన కేన్పడఁగన్. 296

క. వాకిరిమాటలఁ దేలక। భావంబునఁ గీడు మేలుఁ బరికించి యస
ద్భావుని సద్భావుని నవ। నీనర యోగ్యుఁడు సెఱుఁగ నేరఁగ నలయున్. 297

ఆ. అరినృపాలు పెంపు నాత్మయాశక్తియు। నెఱిఁగి మూర్ఖవృత్తి నొదవక
యుదిరవృత్తి నవనియుక్తి మేలడఁ। గదిపి హీనబలుఁడు గెలిచి నిలుచు. 298

క. కిరణములభంగిఁ జతురపుఁ। బరిజనముల నెందుఁ జొనిపి పరకృత్యంబుల్
నిరతంబును గనుగొనుచును। ధరణికరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్. 299

చ. అనయముఁ జేర్చు కామమున నర్థము ధర్మముఁ గాఁగు కామతం
త్రినిరతుఁ డైనవాఁడు నపథప్రతిపన్నుఁడు గాఁడు దుష్టదం
డన మొనరింపఁ డిట్టిపతి డాయరు సాధులు నార్యులున్ సుహృ
జ్జనములు దానఁ జేటు నగుఁ జావును బొటిలు నెల్లభంగులన్. 300

క. తనభూమిఁ బరులభూమిని। ధనము నుపార్జింప వలయు ధరణీశునకున్
ధనములు మూలము రాజ్యం। బునకును మూల మగుధర్మ మునకు నరేంద్రా. 301

క. తనకొలఁది నుపాయంబులు। నొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని
ర్ధనుని నిజప్రజయును నై। కొనదు విరోధులును సరకు గొనరు కుమారా. 302

క. తెరువాటున మ్రుచ్చిమి న। ర్థము లగుకూ్రరులకు మూఁక ద్రోహం బగు న
వ్వైరవిరోధుల బలంబున। ధరణీశుఁడు గూర్చుకొనుట సైన్యము దెచ్చున్. 303

క. అన్యాయంబునఁ బొసఁగిన। సైన్యముచే సమరజయము సమకూర దనూ
నన్యాయపరులు గాంతురు। మాన్యత్వము ధన్యు లైన మనుజాధీశా. 304

ఆ. మేలు చేసి తగినమిత్రునిఁ బడసి త। త్సచరితముల నచ్చుసుఖము లనుభ
వింపఁ జాలు టుడిగి వేర్పడి యుండుట। యరయ నీతివిదుల తెరవు గాదు 305

చ. అరుల నమిత్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మకృత్య మ
వ్వైర వరిముష్టిభం బరులు వీరల నుండియు మిత్రభావముం
బొరయుటయున్ సుహృజ్జనులపోలికి గర్రయు శత్రుతాగుణ
మ్మొగిన మొకప్పు డూపుటయుఁ జూతుము గాద ధరిత్రి నెల్లెడన్. 306

క. బలవంతుఁ డైనశత్రుని। వలనఁ బ్రజాజనము నెరిగి నలను కలిమిఁ దాఁ
గలసియు నది గడవనఁ గాఁ। దొలఁగ వలయు నమ్మ నేనిఁ దుదిఁ గీడొలయున్ 307

తే. నమ్మఁ దగనివారి నమ్మకయున్నది। తెగినవారి నైనఁ దద్ద నమ్మి
యుండఁ దగదు తన్ను నొరులు నమ్ముదు నట్ల। యుండి యొరులనమ్మకునికి నీతి 308

క. వినుము తరి వేచి రిపు మూఁ। పున నెూఁగ వలయు సమయము గనుగొని గ్రి
క్కునఁ గడవ శిలాస్థలి నై। చినచాడ్పున నేర్పు మెఱయఁ జెలుచుటయొప్పున్. 309

క. విని విననివాఁడపోలెం। గని కాననివాఁడపోలెఁ గానలయు విభుం
డొనరింపఁ దలంచినపని। కను వగునంతకు నభేద్యుఁడై జనులరయఁడన్. 310

తే. బహుళమగుగర్వమునఁ గార్యభంగి యూనున। కార్యసరణియు నెఱుఁగ కవార్యవృత్తి
గాని తెరవున నడచినయేని గురుని। నైన శాసింపఁగా దగు నండ్రు బుధులు 311

క. తెగఁ దీర్పక తెగ నార్పక। తెగటార్పక కడమకొంత దిక్కుగ నున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ। బగయును మఱి పెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్ 312

ఆ. మార్దవమున మృదువు మర్దింపఁగా వచ్చు। మార్దవమునఁ బరవిమర్దనంబుఁ
జెల్లు మార్దవమునఁ జెల్లనియది లేదు। గాన మృదువు తలప ఖరము నువ్వె 314

క. తపము నిదానము ధర్మ। ప్రపంచమున కెల్ల దానిఁ గ్రమమున నృపతిం
త్రిపరాయణు లొనరింతు రధిప ఫలమూలాంబుస్మృతిఁ దృప్తిఁ బొరయుచున్ 315

క. విను మశననిగ్రహము దప। మనునభిధానంబు గలమహాధర్మము త
ద్ధనవంతుది స్తశగతిఁ। జను నఖిలస్థావరములు జంగమతత్త్వులున్. 316

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు। లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు
లగుఁ దపంబున సత్యశౌచాదు లోలయు। నఖిలసిద్ధులు నఱచేత నావహిల్లు 317

క. సమతయును దమముఁ దితిక్షయు। నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య
త్వములు నహింసాదానా। క్షమాత్యజనసూనృతములు సత్యము మూర్తుల్ 318

చ. కుదురు సమస్తధర్మములకున్ విను సత్యము యోగమోక్షస
త్పదములు సత్యకార్యములు పాప మసత్యముకంటె నొండు లే
దు పలుఁప నశ్వమేధములు తొమ్మిదినూఱులు రెండు నూఱు నై
యొదవిన నీదు గావు ధరణిస్థము సత్యముతోడ నారయన్ 319

క. భూతములు జరాయుజనో। పేతంబులు గాన మోక్షమెచఁ గోరుట మే
లాతతనిర్గ్రియాసం। జాతమనోమలిభభారనహఁ దగుకంటెన్. 320

క. మనమున ధర్మము నర్థం। బును కామముఁ గలుకొనక పారపాచ్చేము లై
చన సుఖదుఃఖంబుల ముడు। మును వైద్యముఁ బొందకునికి మోక్షకరమగున్ 321

ఉ. కూర్చుఁడు లోభియున్ శఠుఁడు కొంకియుఁడుఁ జడుఁడుం గృతఘ్నుఁడున్
నేఁగనివాఁడు బొంకరియు నిందకు నోర్వనివాఁడు బందయున్
దీరతలేమి దుర్గుణము మతివ్యసనత్వము గల్గువారలుం
జేయఁ నుచ్చి భూపతికిఁ జెప్ప రొనర్చ్చ నరేశ్వరోత్తమా. 322

క. మిత్రుం డైహికములు నా । ముష్మికములు నైనభద్రములు దలకొలుపున్
మిత్రఘనంబులలోనను । మిత్రుఁడ యెక్కుఁడనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్.

క. ఉత్తమకులజుఁడు సుగుణా । యత్తుఁడు సుస్నేహమతియు నగుమిత్త్రునకుం
జిత్త మెలర్చ్చ తెలంగునఁ । బొత్తున మన వలయు శుభముఁ బొందవలసినన్ 324

క. కదియుం గాష్ఠముఁ గాష్ఠము । నదిలో మఱి కొంతసేపునకు బాయును నె
మ్మది నట్లుగఁ దలఁపఁగ నల । వదె పితృపుత్త్రాది బంధువర్గము సఖిపా 325

క. ఇది నాయది యనునూఁత । న్మది నెయ్యది పట్టుకొల్పినను వాసిత మై
తుది జేటు నొంది వానికి । నది లోకము నాసహించు నత్యంతంబున్ 326

క. భీరుఁడు శూరుఁడు జడుఁడు వి । శారదుఁ డబలాత్మకుండు సబలుం డన లే
దేరి నయిన మృత్యువు దు । ర్వారం బై యపహరించు వైశికపర్యా 327

క. కామక్రోధాద్యము లగు । నీమానసవికృతు లుడిపి యేకాంతస్పృహా
రాముఁడ వై నిను వెదకుట । సూ మే లొం డెల్ల నుడుగు సులభవివేకా 328

క. ఎవ్వోటి నైన నధముఁడు । విన్పాలవిడి నుండు లేమ వెలిపించుకయుం
బొచ్చెంపుఁజంద మెల్లఁడు । మెచ్చరె సుగ్రైనఁ బలుకు మృదువై యుండన్ 329

క. ధనవత్త్వము దుఃఖకరం । బని కని తత్కాంక్ష విడుచునతనికి ధనితా
జనితాత్మాధీనత్వం । బనుపమసౌఖ్యంబు సేయు నక్షీణముగన్ 330

క. మనమునకు సుఖముఁ గోరెదు । జనులకు స్వర్గక్రియావిశారదభంగుల్
పోనుపడ విడిచి భయము రే । కునికియ యూహించిచూడ సుర వ్యాసంగిన్ 331

తే. సొమ్ము గోరినయంతన సుఖముగలుగ । దని యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె
కలిగె నేని ననేకచింతల నొసర్చుఁ । జెడుట చావుతోఁ దుల్య మయ్యెడుమరేల? 332

క. శోకశరీమత్స్యస్థలమున్ । నీకలిమియు మూల మగుట నీ కగపడువాఁ
డేక ద్రవ్యము గానం । డోకామమ నిన్ను దొలఁగి యుండెద సుఖి నై 333

తే. ధనము చేటున విడివి నామసము నిన్ను । నీడ విడిచెను గామమ యేను శాంతి
దాంతిసత్యక్షమాభూతదయలఁ జెంది । నాఁడ లోభాదు లొందవు నన్ను నింక. 334

తే. కామ సుఖదివ్యసుఖములకాంక్ష దొలఁగు । మేలు షోడశాంశంబునఁ బోలలేవు
గాన కామము నిను శత్రుకరణిఁ జంపి । బ్రహ్మపురమున నుండెద రాజువోలె 335

క. చనినఁ జను నున్న నుండును। మనుజుఁ డొకటి సేయఁ జేయు మనుజాధిప తో
డన తగిలి నీడవోలెను। విను చేసినకీడు మేలు విడువవు వానిన్ 336

క. కఱవుపయిఁ గఱవు వొరయుచు। వెఱపుపయిన్ వెఱపు దోఁప విడుమనియెడుమం
దొఱఁగమిపైఁ బురుషుఁ డిడుము। దొఱఁగమిఁ జేర్పడుచు నడచు దుష్కర్మములన్

ఆ. ఉత్సాహంబుమీఁద నుత్సాహ మందుచు। సుఖముమీఁద సుఖము సొప్పడంగఁ
బుణ్యపదముమీఁదఁ బుణ్యపదంబున। కరుగు నరుఁడు సత్కృతి యైన నధిప 338

క. విను గుణములు మాయకు నొడ। లని యెఱిఁగి తమోరజస్సు లడఁచి సుసత్త్వం
బున నిలిచి సద్వివేకం। బున నదియుం ద్రోచి విమలబోధాత్ముఁ డగున్ 339

క. సత్యము తపమును యజ్ఞము। సత్యము వేదంబు దాంతి శాంతియు నగుటన్
సత్యము దొఱఁగుట నిర్మల। నిత్యానుష్ఠానములును నిష్ఫలము లగున్ 340

క. విను మానసపరిసన్నతఁ। దను గనుపురుషుండు గలుషతముఁ గానఁడు దే
టినసీట రూపు నూడఁగ। నను వై కలక నటు లేనియట్లులపోలెన్ 341

తే. ఇంద్రియంబులు దమయిచ్చ నిట్టునట్టు। దిరుగ నేని దుఃఖంబులఁ దెచ్చు నవియు
కట్టువడి సుఖ మొసరించుఁ గాన నాత్మ।గావలయు నింద్రియచోరగుణమువలన

క. జ్ఞానము గేవలకృప న। జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయం
గా నది సకలధరిత్రీ। దానంబునకంటె నధికతరఫలద మగున్ 343

తే. వెలుఁగు చుండెడిదీపంబు వేఱువస్తు। వులఁ బ్రకాశింపఁ జేయున ట్లలఘునిత్య
బోధనజ్యోతి యింద్రియములను మాన। సమును దనప్రభ విగతజాడ్యములఁ జేయు

క. విను పురుషున కింద్రియములు। మనంబు గలిగించుఁ గ్రియల మనుజేశునకుం
దనతన తెఱఁగునఁ గార్యము। లనేకములు నూపుసచివు లట్టుల నతాఁ. 345

క. వల యురి యోచము గాలము। గలిగి కదా మృగముఁ బక్షి గజము ఝషము ద
త్తులు పట్టుదు రట్లై త। జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. 346

క. పా మెఱుఁగుఁ బాముకాళులు। ధీమంతుం డెఱుఁగ నేర్చు ధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని। ధీమలనిర్మోచనంబు తెఱఁగు నెఱిఁగినన్. 347

ఆ. అడవి సొచ్చి యంతకంటెకు నపులకు। నతికుతూహలమున నరిగి యరిగి
చూచు చుండునట్లు నూనె సంసారకా। ననమునందుఁ దిరుగు జనులనడపు. 348

క. విను తెన్ను లుడుపఁగ భేషజ। మునకుం దలకొనినచందమున మది సత్యం
బును శౌచము శమమును దమ। మును నెలకొలుపంగ నలయు మోహచ్యుతికిన్.

తే. స్మృతియుసంప్రీతియును బ్రసన్నతయు మతియు। నిదృశములగు సత్త్వగుణోదితములు
రాగలోభరోషాదులు రాజసములు। దర్పశోకప్రముఖములు తామసములు. 350

క. జ్ఞానాజ్ఞానంబులకుం। దాన యుపాశ్రయము బుద్ధి తత్త్వాహంకా
రానూనలక్షణాద్యం। బైనదొలుక దాని జీవుఁ డని చెప్ప శ్రుతుల్. 351

క. జ్ఞానంబు దృష్టి నరునకు। గాన నయనహీను నపకరణి యగుటఁ బ్ర
జ్ఞానవిహీనుని నడవడి। దీని నెఱుఁగ వలయు నెఱుక దెచ్చికొనంగన్. 352

క. పరిహాసము భాషణమును। నిరీక్షణము లోనుగాఁగ నింద్యంబులు నుం
దరులతోడ దీని కే మని। చొరఁ దగ దట్టైన మనసు సొత్తురు నుదతుల్. 353

క. విను మాంసాస్థిమయం బని। వనితాంగము సద్వివేకవైభవమునఁ గాం
చిన నందు మది దగుల దా। వనికిని నాడీవిశుద్ధి పాఱి పగుఁ బుత్రి. 354

క. జ్ఞానము యింధనముగ ని। జ్ఞానాగ్నిం బ్రబలఁ జేయ జరయు మరణముల్
నానావిధదుఃఖంబులు। లేనిచియమృత మక్షరంబు లె క్కెన తోఁచుఁగా. 355

క. కట్టినచీరయును మఁ జైఁ। బెట్టినచీరయును మాలి విగి యారంగాఁ
జుట్టినచీరయుఁ బోలెను। నెట్టన పొదివినది దేహిని గుణత్రయముల్. 356

క. వాకును మనసును గాయము। నేకాయనవృత్తి శౌచ మెసలని తపమున్
జేకొనునది యది బోధ। శ్రీకి ఘృతంబునకు వెన్న క్రియ జనక మగుల్. 357

తే. బ్రహ్మచర్యమహింసనాఁ బరఁగుపరమ। ధర్మములు రెండు నవ్వియు త్తమతపంబు
దానిఁ గలవాఁడు నిర్మలజ్ఞానయోగ। సంతుఁ డై చూడ నేర్చు సర్వంబు నసఘ

క. ప్రియములు నప్రియములు నహ్య। దయమునఁ జిక్కనడఁ దిర్చు దత్తదనేక
క్రియలకుఁ బొచ్చునరుఁడు మోయి। న్యాయమగు టెఱుఁగండు వేఱుజరాడివ్యసనల్ 359

క. ధనములు బంధులు భోగము। లనిరోడుచనస్థిరము లెల్ల నాత్మ కెరవు సే
సిన శాంతి యలవడును మన। మున శాంతి శ్రీసమృద్ధి మోక్షము నిచ్చున్. 360

తే. నరుఁడు సుఖదుఃఖములవెంటఁ బోరయ వీక। ములఁచి యాత్మను జేర్చిన మానసంబు
లీన మగు నండ జలములలోన నిడిన। లవణకణముచందంబున నవనినాథ. 361

క. సమసృష్టిని దాయియుఁ గన। కయుఁ జూచుచు పక్షమాధికలితం బగుచు
త్తము నడపిన శబ్దబ్రహ్మము షణ్మాసముల యోగిమతి న ర్తించున్. 362

క. అనఘ దివసంబు రాత్రియు। ననునివి భానునకు లేనియట్టులు సతతం
బును పరమయోగయుక్తుఁ డగు। మునికి వివేకావివేకములు లే కుండున్. 363

క. ఒరు లేమేని నొనర్చిన। నరవర యప్రియము దనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయ కునికి। పరాయణము పరమధర్మపథముల కెల్లన్. 364

క. భూతదయయు ననహంకా। రాతిశయముఁ గలుగువిమలుఁ డపాప్రియశ్చి
త్తాతురుఁడు మూఁడు విధులు న। నీతము లైనను దృఢాత్మనిష్టకతమునన్. 365

క. సంతోషామృతసుఖిత। స్వాంతుం డగు నేని వట్టివాఁడు గృహంబుం
గాంతారదేశమున నొ। క్కంత గ నిశ్చింతవృత్తి నక్షోభ్యుఁ డగున్. 366

క. రోగంబుఁ దపంబుఁ బరి। త్యాగంబును గాక యొండు లగునె హితంబుల్
రాగముసరిదుఃఖంబును। త్యాగముఁ బోలెడిసుఖంబు నరయం గలదే. 367

క. విను కుసుమంబుల వాసిం। చిన నొప్పనికంపు విడిచి చెందును సౌర
భ్యనిరూఢిం దిల లట్టుల। యనఘా సత్కృతముల జీవుఁ డకలంకుఁ డగున్. 368

క. అంతంతకు సత్కర్మము। లెంతయుఁ బెను పొంద జీవుఁ డెక్కుడుచాయం
జింతాకలుష ము వాయఁగ। సంతోషామృతము వాని సంశుద్ధుఁ డగున్. 369

తే. వాఙ్మనోదృష్టికలితపవిత్రవర్తనములఁ। గాయచేష్టితములను నన్యాయపథముఁ
బొరయ నీ కున్న సత్పథనిరతి గలుగు। సత్యశమదమాహింసలు సత్పథములు 370

తే. అనఘ మాధాత్మ్యచిత్తంబునందు విషయ। జాల మత్యంతగాఢసంసక్తి నొందు
లక్కరసము దండాదులఁ జిక్కఁ బట్టు।చందమున దీనిఁ గనుట ప్రశాంతికరము

క. తనగృహమున నభ్యాసం। బున మెలఁగెడునంధుచందమున సంసారం
బునఁ దిరుగుమూఢుఁ డెఱుఁగఁడు। వినుతం బగుమోక్షపథము విమలవివేకా. 372

క. వినుము మృణాళంబున నం। టినకొంపి జలంబులం గడిగినను బెడఁబా
సినక్రియ విమలజ్ఞానం। బున సంసారంబు వాయుఁ బురుషు నరేంద్రా. 373

క. యోగనిరూఢుఁడు సంగ। త్యాగానంతైకనిరతుఁ డతనికి జనసం
యోగము మృతిదైన్యంబును। భోగాభోగసుఖదుఃఖములు లే వధిపా. 374

ఆ. ప్రకృతి దొలఁగి తన్నుఁ బరికించుజీవుండు। పరముఁ గాంచు నపుడు ప్రకృతిసగుణ
తానిరూఢి యడఁగి తన్మయత్వము నొంది। జీవకేవలత్వసిద్ధి యొలయు. 375

క. వినవె కేవలుఁ డగుజీవుఁడు। దనుఁ బరముం గాఁగఁ జూచి తల్లీనత్వం
బున వెలుఁగునది నిరామయ। మనంత మగుపదము నూవె యతులవివేకా. 376

ఆ. జలముఁ గదిసి యుండి జలముచే నార్ద్రింబు। గాక యుండునట్టికమలదళము
భంగి నంతరాత్మ ప్రకృతిఁ బొందియును స।త్ప్రకృతి బొందకుండు వీతదోష. 377

తే. ఇంద్రియంబులు మనమునం దిమురఁజేసి। మనసు దిగిచి యహంకారమున నడంచి
బుద్ధిలోన నహంకృతిఁ బుచ్చి బుద్ధి। ప్రకృతిఁ గలఁపఁ దధ్యాసతత్పరత గలుగు 378

తే. తాను దెగునేని బాంధవదారపుత్ర। మిత్రులును సజ్జనంబు లేమిటికి విగత
చిత్తుఁడై గుహఁ సొచ్చి నిశ్చింతబుద్ధిఁ। దపవి కానంగ వలయదె తన్నుఁ దాన. 379

తే. జరయు మరణంబు మర్త్యునిజన్మ మాది। గాఁగ వెనువెంటఁ దగులునంగంబు వేచి
యొల్లి సేసెద నని కామే లిపుడ చేయు।(వినుము)గాచు నె మృత్యువు జనుల పనులు

ఆ. ఆత్మకానగమును లంతియు చుట్టంబు। లగ్నిఁ గలపి మరలు నఖిల మైన
జ్ఞాతిజనము దీనిఁ జర్చింప కందఱు। యందు మమత బెనుచు నజ్ఞుఁ డనఘ. 381

తే. భోగములు సంపరిత్యక్తములుగఁ జేసి। కేవలాంగుఁడై నిర్మలభావయుక్తిఁ
దపము గృహమున నేనిఁ దత్పరత నాచ।రించి సంసారజలధిఁ దరించు నరుఁడు 382

ఆ. ఏన కలను నాకు నెవ్వరివానిఁ గా। నాత్మఁ దలఁతు నన్నునట్టివాని
నెందుఁ గానఁ గాన నెవ్వరివాఁడను। గా ననంగ వలదె మానసీయ. 383

క. కోరికయు నొల్లమియు లే। కేమూపున ఘాతములకు నెగ్గు తెలంగుం
జేరక యకామవృత్తిఁ ద। పోరతి నున్నతఁడు బ్రహ్మమును బ్రాపించుక్ 384

క. వినఁ జూడం బడునంద। ల్లను సమతం బరముఁ గనుచు లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాదిద్వం। ద్వనిరూఢుఁడు గాక యున్నతఁడు ముక్తిఁ గనుక్ 385

క. ఇనుమును గనకము నిందయు। వినుతియు సమములుగఁ గొనుచు వివిధాంగకముల్
దనలోన నడఁచు కమఠము।ననువున నింద్రియము లడఁచునతఁడు గను శివుక్ 386

ఆ. హింస లేక యునికి యింద్రియజయము నై। రాశ్య మచపలత్వ మనుగుణములు
నాల్గుఁ గలుగునట్టినరునకుఁ గరతలా। మలక మంత రాత్మమహిమ యెల్ల. 387

చ. అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థము లే కొకండు నె
వ్వరిమది నొంచు వ్రాలెఁ దగ వారలు దానిన పూని యాచరిం
తు రదియ వారి కిష్టఫలదోహనకార్య మొనర్చు నెల్లెడం
బురుషులఁ జూడమే తమకుఁ బోలినధర్మములన్ నెలంగఁగన్. 388

క. న్యాయమున సంగరంబుం। జేయఁగ శస్త్రాగ్ని డస్సుఁ జెందిన దానెం
గాయంబు విడుచుపురుషుఁడు। వే యేటికి మోక్షలక్ష్మివిభుఁ డగు నధిపా. 389

క. తనతోఁ దుల్యుం డైనను। మనుజాధిప యధికబలసమగ్రత్వము గ
ల్గిన నని శత్రుని వధియిం। చిన నరపతి పుణ్యలోకసిద్ధిం బొందున్. 390

క. పరమర్మభేదంబులు నయ। విరహితములు ధర్మకార్యవిముఖంబులు ని
ష్ఠురములు నగుమాటలు స। త్పురుషుం డాడఁడవి సత్యములు గా కునికిన్. 391

క. అతిథిజనులు తమతమవాం। ఛితము లనుభవించునట్లు సేయం గనివం
గృహకృత్యతఁ బొందరె గృహ। పతియును గృహిణియును ధర్మభారమువలనన్. 392

చ. వినుము జరానుబంధమున వెండ్రుకతండముఁ బండ్లు వీనులుం
గనుఁగనయుండ్లు జరం బొరయుఁ గాని యొకప్పుడుఁ దృష్ణ జీర్ణ గా
దనియును దెల్పి ప్రాణముల వన్నెక పోదది రోగ మల్పబు
ద్ధి నరులు చోర్చిన తే రది మనం జొరనీక సుఖాప్తులై బుధుల్. 393

క. పురుషాదిక మై తోఁచుచు। నిరూపణము సేయ నూఁది నిర్దేశింపన్
వెంపు పడక శాశ్వతసుఖ। భరితత నిర్వాణ మనఁగఁబడుఁ బ్రకృతి నృపా. 394

తే. సత్కులంబునఁ బుట్టుట సకలవేద। ములు బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రాపకములు గావు। శీలసామగ్రి లేనిదుశ్చేష్టితునకు. 395

తే. రూపగుణశీలముల సమరూపుఁ డైన। వరున కీక కన్నెతోఁ దనవలసినట్లు
తగనివానికి నిచ్చుట ధర్మదేవ। తాతనూభవ బ్రహ్మహత్యాసమంబు. 396

క. పాతివ్రత్యము గలిగిన। నాతి యనఁగ నైన మనజనస్తుత వేఱే
యాతతధర్మార్థసుఖ। ఖ్యాతులు సద్భాగ్యములనఁ గాదే కలుగన్. 397

క. కులమును శీలము విద్యయుఁ। గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁగా
వలయును సుకప్రదానా। కలితంబుగ బ్రహ్మకర్మగతి యిది యధిపా. 398

ఆ. క్షాత్రమందు బుధులు కన్య పురుషుఁ గోరి। నతఁడుఁ గన్యవలచి నాసఁ జేయ
వచల మగుపరస్పరానురాగము గని। ప్రియముద మెసఁగఁ జేయుపరిణయంబు. 399

క. కన్య మనంబును సనిసినఁ। గన్నెయు యెవ్వానిఁ గోరు గాంధర్వం బా
యన్య నతని కిచ్చుట వెల। యన్నట యామునిము సూనె పాండవముఖ్యా. 400

క. బలిమి మెఱయ నమ్మఁడు గన్నెకుఁ। గలవారిం బొడిచి కరము క్రౌర్యంబున న
ప్పొలఁతుక దుఃఖింపఁగ వా। రలు వోసలఁగఁ దెచ్చికొనుట రాక్షసము నృపా. 401

ఆ. అయిదు తెఱఁగులందు నారయ మూఁడు శ్రే। ష్ఠములు ధర్మకృతులు ధర్మప్రతి
యాసురంబు రాక్షసావ్యాయంబును ధర్మ। మార సంవిధానమాషితములు. 402

తే. మాతృపితృహీన యైనను భ్రాతృరహిత। భావ మందిన నవ్వాల పరిణయార్థ
వరణమున కర్హ గా వని మనువులాగ్ర। గణ్య చెప్పుదురు పరిణయకల్పవిదులు. 403

క. నిజదారపరులు సంతత। యజనరతులుఁ గామరోషహంతలు నగుస
ద్ద్విజుల నరసి ధన మిచ్చుట। త్రిజగత్పూజ్య మగు నండ్రు ధీరవిచారా. 404

క. దారిద్ర్యముచేఁ గుందుచు। జేరిన నడుగంగఁ బోవ కెంతయుఁ గృశతం
గూరినవిప్రున కుర్వగ। వారనిపయి నీగిఫలము వాగ్గోచరమే. 405

ఆ. అన్నదానసదృశ మగుదాన మెందు నె। న్నఁడును లేదు గావునను విధేయ
మన్నదాన మధికయత్నపూర్వంబుగాఁ। బూని దానిచేఁత పుణ్యతమము. 406

క. పరమజ్ఞానులకెుద్దను। బరఁగిన నజ్ఞుఁడును బోధభరితుఁ డగు నిరం
తరమేరుసమీపస్థితి। హిరణ్యరుచిఁ గాక మెసక మెసఁగినపగిదిన్. 407

తే. ఇన్నియాచారములలోన నెక్కు డండ్రు। సకలభూతములందును సదయుఁ డగుట
యాదిమును లట్లుగావున నఖిలసర్ణ్ణ। మునకు దయకిమ్మె సర్వదయుఃకలయఃగణము. 408

క. వినుదానంబులఁ బాపము। లనఘా చెడు దానములకు నన్నిటికిని స
జ్జనసేవ్య యన్నదానము। మను లధికం బండ్రు పాపములఁ బాపు నెపక్. 409

తే. దినము పథ్యంబు గా కుండఁ దవిరి యన్న। పానదానంబు లొదవినభంగిఁ జేసి
యతిభుజించుటఁబోలెనుమహితధర్మ। కార్యమొండొకఁడెందునుగలదెయరయ. 410

తే. మనసునను వాక్కునను గాయమునను హింస। నెవఁడు మాంసంబుదినుటతో నాలుగిరెప్య
దెఱఁగులవినువ్వెహింసపరి త్యజింపఁజేయుఁ। గానకడుఁగఁడు మాంసభక్షణముదలఁప. 411

తే. వాజిమేధంబుకంటెను బూజనీయ। కర్మ మందురు మాంసభక్షణము విడుపు
వినుము చంపుటయును జంపఁ బనుచుటయును। గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప.

ఉ. మ్రానను దాతనుం గలదె మాంసము ప్రాణుల మేనఁ గాక య
మ్మేనుల నొంచ నప్పుడమ మేములు సోఁకినమాత్రి నె ట్లగున్
దానిఁ దలంపఁగా నలదె తా నదిమానిన హింస లన్నియున్
మానవె యందు నుత్తముఁడు మాంసము మాను దయార్ద్రచిత్తుఁ డై. 413

క. దానము ధర్మము దప మి। జ్యానిష్ఠ యనంగఁ గల్గుసత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా। నూనాకృతు లండ్రు శ్రుతుల నూనినపెద్దల్. 414

ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁ బో। షింతు ననుటకంటెఁ జెట్ట లేదు
మాంసభక్షణంబు మానుటకంటెను। మేలు లేదు కర్మజాలకమున. 415

క. భూతముల కలుగునతనికి। భూతము లఖిలములు నలుగు భూతహితార్థీ
భూతముల కభయ మిచ్చిన। పూతాత్మున కభయ మిచ్చు భూతావలియున్. 416

ఆ. దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు। శౌచమంత్రితంత్రిసత్యములును
బుధు లహింసరూపములు గాఁగఁ జెప్పుటి। సెల్లకర్మ మను వ్యాహింసకలిమి. 417

తే. శస్త్రజీవికయును నరిష్టభాగ। మాహరించుటయును భృత్యు నగయుటయును
బ్రిజవివాదంబువినునోటఁబత్తుపాలి। గామియును రాజాలకుఁ గృత్యకర్మకోటి. 418

తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి। యతిథి వచ్చినఁ బ్రియమున నతనిఁ దప్పి
వోవు నట్లుగ సముచితభోజనంబు। నొప్పు పెల్లభృత్యములకుఁ బెద్ద దలఁప. 419

క. పరబలము పై నడరి సె। త్తుగు వత్తులు వారిఁ జంపుగురు దురమున న
ప్పురుసఁడినంబును బుట్టో। త్తర మని వేదములు సెప్పుఁ దనుతిరమధ్యా. 420

క. పోగులయందలిమగఁడు। మారణముం బుణ్యలోకమహితమహిమకుం
గారణ మెఱుఁగు మహింసా। కారం బెట్టి దని నీవ కార్యవిచారా. 421

క. వంచనయును జాడ్యంబును। నించుకయును లేక ప్రభువునిష్ట మెఱిఁగి తాఁ
బంచినపని నెరవుసఁ గా। వించినకర్మకరుఁ డొందు విపులధనంబుల్. 422

క. జీర్ణుఁడు జీర్ణశరీరముఁ। బో విడిచి నవంబుఁ బొందఁ బుట్టను పేరం
దా వెలయం దద్దశ జీ। వావలి వర్తించు నిటు గతాగతపదవిన్. 423

తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
పలనిభక్తియు నాయువుపాలుపు నిచ్చు
నలుక బొంకు కూరిత శుచితాపగమము
గురువిరోధ మాయువుఁ గడుఁ గుఱంగఁ జేయు. 424

తే. శుచితము నరునిఁ బరజ్ఞానయుతునిఁ జేయు। దానిసత్కృత మల్పమును ననూనఫలము
నిచ్చు నజ్ఞానసత్కర్మ మెంత యైన। నఫల మగుఁ గాన శుచిజనంతుఁ డగుట వలయు

ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు లఘ్వశనంబు నై మదిం
జూచుచు నంతరాత్మ నెడ సొచ్చిన శ్లాఘ్య విశేషముల్ ధృతిం
దోషము భక్తియుక్తి గురుండు ప్రమోదముఁ దుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠితమోక్షసుఖంబు సొచ్చెడున్. 426

క. తన్ను దేహియు దేహము నే। ననునిశ్చయదృష్టి గల్గువాతఁడు సాలన్
మనసు మగిడింప నది ని। ర్మనస్కృతిఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్ 427

తే. నాగు లింద్రియవిభ్రాంతి సంహరింతు। రఘము దెలిసి ప్రాయశ్చిత్త మాచరింతు
రపరిశోకంబుగా ధర్మ మాచరింతు। రఖిలభూతదయాళుత్వ మారఁ గలరు. 428

క. తత్త్వ మనశ్వర మగుసీ। రత్త్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా
శిత్త్వంబు హింసకశ్వము। దాత్త్విక మై లేదు దేహదళనమున నృపా. 429

క. శరధిపరివేష్టితక్షితిఁ। బరిపాలించినను దానిపై దృఢమమతం
బొరయక వర్తించిన న। ప్పురుషుని దురితంబు లెట్లు పొందఁగ నేర్చున్. 430

క. ననమున వన్యాహారం। బున వర్తించినఁ బదార్థములపై మమతన్
మనమున విడకుండిన న। మ్మనుజుఁడు మృత్యుముఖవర్తి మనుజాధీశా. 431

క. వెలిపగఱ గెలుపు గెలుపే। యలఘుమతిన్ గెలువఁ దలఁపు మభ్యంతరశ
త్రులఁ దన్నిగ్రహము మోక్షము। నలఘుఖపం జాలు నొంట నమ్మె లగునే. 432

క. విను మంతెఱ్ఱిశ్రోత్రిలలో। ఘనుఁ డగుఁ గాముఁడు నిరస్తకామం బగుప
ర్తనము విశద మఖ్యాయునయు। జనదానంబులును గామసహితములు గదా. 433

తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ। బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు
నతఁ డనింధనానలమున ట్లల్లఁ బొందు। వికృతివర్జిత యైననిర్వృతి కృతాత్మ. 434

క. తనువువలన నిష్క్రమ్యం। బొనర్చి జీవాత్మఁ గాంచుయోగివరుం డ
య్యాను వొదవి యట్లు దన్నుం। గనినప్పుడు జననమరణగతులం దొలఁగున్. 435

క. ముక్తుండు జరామరణవి। యుక్తుం డై హర్షశోకయోగ మెడలి స
ద్భక్తులకును సన్నిధ మీ। శక్తుం డగుఁ జావ్వ బ్రహ్మచర్యము పేర్మిన్. 436

ఆ. ఒడలియస్థిరత్వ మూహించి యాత్మయం। దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా। గాదిదుఃఖములకు నగపడండు. 437

క. విను యోగయుక్తునకు శీ। తోష్ణనిహతి జలబాధ యగ్నిదాహము మొద లై
చనునవ్వికారములు లే। వనఘ యతఁడు గోరఁ డైంద్రి మహపద మైనన్. 438

క. తనయందు తన్ను లెస్సఁగ। గనుఁగొని గడచినసుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కర్హ్యాను। వినుతానుష్ఠానమునకు వినుమా ఫలయున్. 439

క. తనరెుఁ జిఁగిన తెరవున నే। మ్మన మంత్ర్వర్తిఁ జేసి మఱి బాహ్యగతిం
జననీ కుండఁగ నది యెుం। దనువునఁ బడు నిలుప వలయు నచ్చట దానిన్. 440

తే. అద్యావాదితత్త్వము చక్షురాదికంబు। లైనయింద్రియములకు గ్రాహ్యంబుగాదు
సకలమలవిరాసాజ్యప్రసన్నశరము। నఃప్రదీపంబు దర్శనం బొనర్చు. 441

క. కలయంగ నెల్లయెడలం। దలలును లోచనములును బదంబులు హస్తం
బులు నై యాత్మత్వం బు। జ్జ్వలభంగి వెలుంగ యోగవంతుఁడు గాంచున్. 442

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహసంగంబు। నీవ విడిచి యొప్పఁ డీయుపాయ
ములు భజించు వాఁడు మోక్షలక్ష్మికిఁ బతి।యగు నొకింత సందియంబు వలదు 443

తే. సత్యమునన భూతంబులు సంభవించు। నంద వర్తించు దానన యడఁగు విది గు
ణత్రియాత్మకసత్యచరిత్ర మమల। బుద్ధులార సత్యంబుప్రసిద్ధి గనుఁడు. 444

చ. బలమును శౌర్యమున్ ముదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మి సేఁతయును గాంక్షయు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పప్రభాషలుఁ గామినీజనం
బులరయొద గాఢరాగతయు బొంకును నుబ్బ రజఃప్రభూతముల్. 445

క. రాజసగుణములకుం గల। నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
దీజితములు గావింపఁగ। నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్. 446

క ధర్మార్థకామగోచర। కర్మములకు సాత్త్వికాదికప్రకరవికా
రోర్మ్ములు హేతువు లగు ని। ష్కర్మతకే తదనుభూతి గారణము సుఁడీ. 447

క. సత్త్వము ప్రదీప మావర। తత్త్వముఁ గాంచుటకుఁ గాన తత్సాధనతా
తత్త్వము వదలక చిత్తను। శుత్త్వాకలిత మగు నెలవు గఁడుర కృతాత్మల్. 448

క. శరనిధితరఁగలభంగిం। బొరిఁ బొరి నవ్యక్తమునన పుట్టు నద్ధంగున్
సురనరధరణీరుహముఖ। చరాచరానేకభూతజాలము లెల్లన్. 449

క. తమము రజస్సుఁ దొలఁగి స। త్త్వమునన రమియించి యగుణతత్త్వముఁ గని స
త్త్వమును దిగవిడుచు వైరా। గ్యమహితుఁ డగు మునివరుం డకల్మషులారా. 450

క. పరమం బనంగ వేదాం। తగహస్యాత్మకత వెలుఁగుతత్త్వంబు నిజం
బరయఁగ క్షేత్రజ్ఞుఁడ యను। పరిణతి గలయతఁడు సర్వపదవిదుఁడు సుఁడీ. 451

క. వృత్తివిశేషమునఁ జనిన। చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా
నెత్తెఱఁగునకుం దివియమి। యుత్తమపురిహాస్య మండ్రు యోగమున మునుల్ 452

క. వినుఁ డన్యాక్రాంతం బగు। పని రెల్ల నవిద్య నొలయు బంధము మమతం
బనుపడిన మృత్యు వమృతం। బనఁ జను నది నిర్మమత్వ మారఁ గలిగినన్. 453

క. కోరికలకుఁ జొరక యసం। గారూఢత గలిగి యెల్లయందును సమతం
గూరినచిత్తంబులు గల। సారాత్మకు లీపథమునఁ జనుటకు శక్తుల్. 454

క. పురరక్షణము గృహంబుగ। నగనర చేయంగ వలయు న్యమ్మఁ గలుగుస
త్పురుషుల నిడఁ దగుఁ గుడుపు ని। దుర మొదలగు లోభపములతో వరువు లరయన్

క. విను మంత్రిభేదమున న। చ్చినకీడున కనఘ శాంతి సేయు టరది కా
వున మంత్రులతో మంత్రా। వననియమం బూఁది చెప్ప వలయుం జావ్మా. 456

క. అమృతమయము బుఋగ్యజుస్సా। మములయుపనిషద్వచస్సమాజములకు వా
చ్యం బగుచుండు పురుషోత్తము ని। త్యము రూపగువాని భక్తిగమ్యుఁ దలంతున్. 469

క. నవ్యక్త క్షేత్రంబున। నవ్యక్తాకృతివిరూఢి నాసీనుం డై
భవ్యత నొందుక్షేత్రా। త్మవ్యపదిష్టుఁ బ్రణుతింతు దామోదరునిన్. 470

క. ప్రకృతివికృతులకు షోడశ। వికారములు వెరసి ప్రకృతివికృతిత్వముఁ బొం
దక యుండఁ గాంతు రెవ్వని। సకలమునులుఁ దలఁతు నట్టిసాంఖ్యాత్మహరిన్. 471

క. అంతశ్చరవైరులు। శాంతములుగఁ జేసి యమలసత్వము శమమున్
దాంతియుఁ గలజనములు గను। నంతర్హితుఁ గొలుతుజలశయను యోగాత్మున్. 472

తే. చరణనాభిశీర్షంబులు ధరయు నంత। రిక్షమును దివమును జగచ్చక్షురగ్ని
దిశలు దృఙ్ముఖశ్రోత్రముల్ దీప్తి లెవ్వ। హాత్మునకు నట్టిహరిని లోకాత్ముఁ దలఁతు

క. మాసర్త్వయనాబ్దమయో। ద్భాసితరూపుఁ డయి సృష్టిఁ బ్రళయంబుఁ దగం
జేసి పొలుపారు శౌరి ను। పాసింతును యోగిభోగ్యబలుఁ గాలాత్మున్. 474

క. సర్వమునందును దానుగ। సర్వముఁ దనయందు నుండు సంచారంబుల్
సర్వమునకుఁ దనవలనన। సర్వాత్మకు నట్టివృష్ణిసత్తముఁ దలఁతున్. 475

ఆ. క్షరము లైనభూతసంఘంబులం దెల్ల। నక్షరస్వరూపుఁ డై వెలుంగు
సకలబుద్ధివృత్తిసాక్షి సాక్ష్యాత్మ న। స్పందబోధఘను ముకుందుఁ దలఁతు. 476

క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల। గాత్రవ్యాప్తత్వమహిమ గలిగి సమీరా
మాత్రమున జీవుండును। గోత్రము నై సర్వవర్తకుం డగుచుండున్. 477

క. విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం। డన భూతాత్ముఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం
డన బుద్ధిసాక్షి యనఁగా। జననరహితుఁ డనఁగఁ బరఁగు శాంతిప్రవణా. 478

ఆ. మణిమయములు గనకమయములు రజతమ। యములుమఱియు మృణ్మయాధికములు
నైనపెక్కుపూసలందుఁ దారమున్నట్లు। భూతకోటియందుఁ బురుషుఁ డుండు.

క. అమృతం బచ్యుత మమలం। బమేయ మవ్యయ మనంత మద్వైతుఁగు యామా
ద్యముల నలవశివచిత్తము। శమాతిరేకమునఁ బొంద సంవేద్య మగున్. 480

తే. అచలు నాత్ము శరణ్యు సహస్రశీర్షు। నభయు కాలు నశీర్షు నారాయణాని స
నాతనుని యోగమూర్తి లోకాతిరిక్తు। ధ్రువుని నీశ్వరు హరి భక్తితోడఁ గొలుతు.

క. కాలముఁ బర్జన్యుండును। నేలయు సస్యంబుఁ గ్రియయు నిష్క్రియయును ధ
ర్మాలోకము నై మహిమ। న్లీల నలుపు దేవదేవుని బ్రణుతింతున్. 482

క. అనలునకు రవికిని శశాం। కునకును గ్రహతారకములకును దేజం బె
వ్వానివలన నావహిల్లెడు। ననుపాధికతేజుఁ గొల్తు నవ్విశ్వాత్ము౯. 483

క. అగమను నబోధ్యుని నఖిల। జగద్భరణుఁ బరు నమూర్తిసాగరునిఁ బ్రబో
ధగరిష్ఠుఁ బంచకాల। జ్ఞు గుణాత్మకు నిర్గుణత్వశోభితుఁ గొలుతు౯. 484

క. వ్యక్తమునకుఁ బ్రభవం బ। వ్యక్తం బాతత్త్వమునకు నవ్వల నవాఙ్మో
యుక్తికిఁ బరాయణం బగు। భక్తపరాధీను భవ్యభావ్యు నుతింతు౯. 485

క. జ్ఞానధ్యానపరాయణు। లైనమహాత్ములు జితేంద్రియత్వమహిమ నె
వ్వానిం బొందిన మగలరు। వాని శరణుఁ జొచ్చి బ్రతుకువాఁడ సుకృతినై. 486

క. ఇనునడుమ వెలుంగుచు సో। మునిమధ్యమునం జలత్వమును బొందనిని
ల్చున వెలయుదీప్తి యగువా। ని నిరంజను నంతరాత్ముని౦ బ్రార్థింతు౯. 487

క. సోమార్కమయంబును దా। రామయమును నిత్యసుస్థిరంబును నగుతే
జోమయతత్త్వము నాత్మా। రామత్వంబున నిరంతరంబును జూతు౯. 488

క. రోషముఁ గామము రాగ। ద్వేషములును లేక భక్తి దిరమై యేకా
శ్లేషునిఁ గాఁ గొలుతు రవి। శ్లేషమనోనిలయవృత్తి సిద్ధులు నిన్ను౯. 489

క. ఫలములు గోరక కర్మం। బులు సలుపుచు వాని విమలబోధాగ్ని నడిం
బొలియించుచు నిర్ద్వంద్వా। త్మ వెలకొను నేకాంతజనులు నినుఁ గందురు హరీ. 490

క. ఏకత్వం బమలత్వ ము। నేకత్వము గలుగునీమహిమచందం బా
లోకింప నిపుణు లగును। శ్లోకులకుం బరమపదము సులభము గాదే. 492

సీ. ఇల జలంబులజలంబులు శిఖి శిఖి వాయువున వాయు నంబరంబునను నంబ
రంబు చిత్తమునఁ జిత్తం బహంకృతి బుద్ధిఁ దగ నొరఁగించి యింత
పట్టును గూర్చ నవ్యక్తంబుఁ జేర్చి యవ్యక్తంబు నిజభంగి నైనత్రిగుణ
సామ్యావ్యవస్థితి నడిసన్న కారణభూతతన్మాత్రలు పొదున కుండఁ

గీ. దొలఁగఁబెట్టుట దొరకొన వలయు దానఁ। బరమమును గేవలము నగుపదముగలిగి
యేన నీ యను నైక్యంపు టెఱుక వొడముఁ। గాత గమనాగమనములు గ్రాఁగిపోవ. 492

క. పరమాత్ముని నారాయణుఁ। జిరంతనుని భక్తశేముషీనిష్ఠాస్వీ
కరణైకాయనుని నమ। స్కరణంబునఁ దలఁతు నతులషడ్వర్గభూతి౯. 493

తే. పునరావృత్తిరహితుం। డనఘా పరమాత్మఁ జెందినట్టి పురుషుఁ డ
ట్టివానితావస్థను మోక్షం। బని చెప్పుదు రంతకంటె నధికము గలదే. 494

16 పృథ్వీబాయి — వీరరసప్రధానమైనవనల. రాజకుమారునిఁ గాపాడుటకు నిజకుమారుని శాత్రవునికత్తి కెఱచేసిన యొక రాజపుత్రిసాధ్వీమణి చరిత్రము. ఇందలి రాజనీతి, సూపకారుల సతుర్లోపాయములును జదువఁదగియలెను.

సత్యవోలు అప్పారావుగారిచే రచింపఁబడినది. 0—8—0

17 హేలావతి — చరిత్రాత్మకమైనవనల. ఒకమాంసీ హుమాయూను చక్రవర్తియొక్క మంత్రికుమారుని వరించి పెండ్లియాడినకథ.

తెల్లాప్రగడ సూర్యనారాయణరావుగారిచే రచింపఁబడినది. 0—4—0

18 ప్రభావతి — ప్రభావతీప్రద్యుమ్నమునకు సరిగ్గా వచనము. పింగళి సూరనార్యుఁడే దీనిని వచనమున వ్రాసినట్లుండును.

సూరాబత్తుల సూర్యనారాయణగారిచే రచింపఁబడినది. 0—4—0

19 మీరాబాయి — భక్తిరసప్రధానమైన పద్యకావ్యము. పతిచే నింద మోపఁబడి ప్రాణముల త్యజించిన శ్రీకృష్ణభక్తురాలిచరిత్రము. ఇందలి పద్యములు ముక్కుతిమ్మనార్యునిపద్యములవలె ముద్దులొలుకుచుండును.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిచే రచింపఁబడినది. 0—4—0

20 కురుపాండవదాయభాగనిర్ణయము — ఇత్యాది శ్రీకాశీభట్ల బ్రహ్మయ్య గారి 'కురుపాండవదాయభాగనిర్ణయము'నకై వ్రాసినఖండనము.

కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచింపఁబడినది. 0—1—6

21 బ్రాహ్మమతము — ఇందు దేవుఁడు, మానవుఁడు, ప్రకృతి, ఉపాసన, పాపము—మోక్షము, అవతారములు—మహాత్ములు, ప్రమాణగ్రంథము—ఈశ్వరప్రత్యాదేశము, సాంఘికాచారము మున్నగు విషయములు యుక్తియుక్తముగఁ జర్చింపఁబడెను.

వాలవర్తి నరసింహము గారిచే రచింపఁబడినది. 0—6—0

22 ఆర్యసూక్తిముక్తావళి (ప్రథమభాగము) — ఇందు భారతమునందలి నీతులు, రాజధర్మములు ఏర్చి కూర్పఁబడెను.

సత్యవోలు అప్పారావుగారిచే రచింపఁబడినది. 0—4—0

23 కర్ణభారము — ఇత్యాది కాళిదాసునకుఁ బ్రాచీనుఁడగు భాసమహాకవిచే రచింపఁబడిన నాటకమునకుఁ దెనుఁగు.

మానవల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ. గారిచే ననువదింపఁబడినది. 0—2—0